# ఎంగెల్స్

## వేతన వ్యవస్థ



# ఫ్రెడరిక్ ఎంగెల్స్

# వేతన వ్యవస్థ

*The Labour Standard* లోని వ్యాసాలు

1881

కారల్ మార్క్స్ - ది. 5-5-83న 165వ జయంతి
ది. 14-3-83న 100వ వర్ధంతి సందర్భముగా మీకు
కృతజ్ఞతలతో మా పాపులర్ షూ మార్టు గ్రూపు
సంస్థలచే బహూకరించబడినది.



"ప్రగతి" ప్రచురణాలయం

మాస్కో

## విషయసూచిక




పాపులర్ షూ మార్ట్ గ్రూపు సంస్థల ట్రస్టు
సన్యాసిరాజు రోడ్, గాంధీనగరం
విజయవాడ–520 003

# న్యాయమైన రోజు పనికి న్యాయమైన రోజు కూలి[1]

యిది గత యాభై సంవత్సరాలుగా యింగ్లీషు కార్మికవర్గ ఉద్యమ నినాదంగా వుంది. 1824లో సంఘాలను గురించిన అపకీర్తికరమైన చట్టాలు[2] రద్దుచేయబడిన తర్వాత ట్రేడ్ యూనియన్లు తలయెత్తుతున్న కాలంలో యిది బాగా ఉపయోగపడింది. యశోదీప్తమైన చార్టిస్టు ఉద్యమ కాలంలో[3], ఇంగ్లీషు కార్మికులు యూరపియన్ కార్మికవర్గపు అగ్రభాగాన నడిచినప్పుడు, యిది యింకా బాగా ఉపయోగబడింది. కానీ, కాలం ముందుకు పోతున్నది; యాభై యేండ్ల క్రితం, ముప్పై యేండ్ల క్రితం కూడా, వాంఛనీయమూ, అవసరమూ అయిన యెన్నో విషయాలు యిప్పుడు పాతబడిపోయినాయి, అవి పూర్తిగా అసందర్భంగా వుంటాయి. యీ పాత, సంప్రదాయ సన్నుతమైన నినాదం కూడా వాటిలో చేరుతుందా?

న్యాయమైన రోజు పనికి న్యాయమైన రోజు కూలా? మరి, న్యాయమైన రోజు పని యేది? న్యాయమైన రోజు కూలి యేది? యే నియమాలతో ఆధునిక సమాజం మనుతూ, తన్ను తాను అభివృద్ధిచేసుకుంటున్నదో, ఆ నియమాలచేత యివి యెలా నిర్ణయింపబడతాయి? దీనికి జవాబు కొరకు మనం నీతిశాస్త్రానికి గానీ, న్యాయశాస్త్రానికి గానీ, మానవతా భావానికి గానీ, న్యాయ దృష్టికి గానీ, చివరకు ధర్మబుద్ధికి గానీ విజ్ఞప్తి చేయకూడదు. నైతికంగా న్యాయమైనది, న్యాయశాస్త్ర దృష్ట్యా న్యాయమైనది కూడా, సాంఘికంగా న్యాయం కాకుండా వుండవచ్చు. సాంఘిక న్యాయం, లేదా సాంఘిక అన్యాయం ఒకే ఒక శాస్త్రంచేత మాత్రమే నిర్ణయింపబడుతుంది — ఉత్పత్తి, మారకాలకు సంబంధించిన శాస్త్రంచేత, అనగా అర్థశాస్త్రంచేత.

మరి, అర్థశాస్త్రం దేనిని న్యాయమైన రోజు కూలి అనీ, న్యాయమైన రోజు పని అనీ అంటుంది? బహిరంగ మార్కెట్‌లో యజమానికీ, కూలివానికీ మధ్య వున్న పోటీచేత నిర్ణయింపబడిన కూలి రేటూ, రోజు పనియొక్క దైర్ఘ్యమూ, తీవ్రతా మాత్రమే. మరి, అలా నిర్ణయింపబడినప్పుడు, అవి యేమిటి?

మామూలు పరిస్థితులలో న్యాయమైన రోజు కూలి అంటే, శ్రామికుని స్థాయియొక్కా, దేశంయొక్కా జీవన ప్రమాణాన్ని అనుసరించి, తన్ను తాను పనిచేసే స్థితిలో వుంచుకోడానికీ, వంశవృద్ధికీ అవసరమైన తిండితీర్థాలను అతనికి యివ్వగల మొత్తం. వర్తకపు యెగుడుదిగుడుల

మూలంగా, వాస్తవంలో వుండే కూలి రేటు యీ రేటుకంటె ఒకోసారి యెక్కువగానూ, ఒకోసారి తక్కువగానూ వుండవచ్చు. కానీ, న్యాయమైన పరిస్థితులలో ఆ రేటు సకల యెగుడుదిగుడుల సరాసరిగా వుండాలి.

న్యాయమైన రోజు పని అంటే, కార్మికుని ఒక రోజుయొక్క పూర్తి శ్రమ శక్తిని ఖర్చుచేసేటంత దీర్ఘమైన పనిదినమూ, అంత తీవ్రత గల వాస్తవమైన పనీ — మరుసటి రోజూ, ఆ తరువాతి రోజులూ అదే మొత్తం పని చేయడానికి అతనికి గల సామర్థ్యంమీద దెబ్బతీయకుండా వుండేవి.

కనుక యీ బేరాన్ని యీవిధంగా వర్ణించవచ్చు — కార్మికుడు పెట్టుబడిదారునికి తన పూర్తి రోజుయొక్క శ్రమ శక్తిని యిస్తాడు; అనగా, యీ బేరంయొక్క నిరంతరాయ పునశ్చరణను అసాధ్యం చేయకుండా అతను యెంత యివ్వగలడో అంత. దీనికి బదులుగా అతను పొందేది యేమిటంటే, ప్రతిరోజూ యిదే బేరంయొక్క పునశ్చరణను సాగించడానికి అవసరమైనంత, అంతకంటె యే మాత్రమూ యెక్కువ కాని, జీవితావసర వస్తువులు. బేరంయొక్క స్వభావం యెంత యెక్కువ అనుమతిస్తుందో అంత కార్మికుడూ, యెంత తక్కువ అనుమతిస్తుందో అంత పెట్టుబడిదారుడూ యిస్తారు. యిది చాలా చిత్రమైన న్యాయం.

కానీ, యీ విషయంలోకి మరింత లోతుగా చూద్దాం. అర్థశాస్త్రజ్ఞుల ప్రకారం వేతనాలూ, పని దినాలూ పోటీచేత నిర్ణయింపబడతాయి గనుక, ప్రారంభంలో యిరు పక్షాలకూ సమాన షరతులు వుండడం న్యాయంగా కనపడుతుంది. కానీ అలా వుండడం లేదు. పెట్టుబడిదారుడు, కార్మికునితో అంగీకారానికి రాలేకపోతే, ఆగి, తన పెట్టుబడిమీద బతకగలడు. కార్మికుడు అలా చేయలేడు. అతనికి బతకడానికి కూలి మాత్రమే వుంది. కనుక అతను యెప్పుడు, యెక్కడ, యే షరతులమీద పని సంపాయించుకోగలిగితే అప్పుడు, అక్కడ, ఆ షరతులమీద పనిని తీసుకోవాలి. ప్రారంభంలోనే కార్మికుడు ప్రతికూల పరిస్థితిలో వున్నాడు. అతనికి ఆకలి అనే భయంకరమైన అసౌకర్యం వుంది. కానీ, పెట్టుబడిదారీ వర్గ అర్థశాస్త్ర ప్రకారం, అది న్యాయానికి పరాకాష్ఠ.

కానీ, యిది కేవలం స్వల్ప విషయం. యాంత్రిక శక్తినీ, యంత్రాలనూ నూతన వృత్తులకు ప్రయోగించడమూ, అప్పటికే వాటికి గురిఅయిన వృత్తులలో యంత్రాల విస్తరణా, మెరుగుదలలూ అంతకంతకూ యెక్కువ "చేతుల"ను నిరుద్యోగులనుగా చేస్తూ వుంటాయి; యీ తొలగింపబడిన "చేతులు" దేశంలోని ఉత్పత్తులలో లీనం చేసుకోబడి, ఉద్యోగం సంపాయించగలగడంకంటె యెంతో వేగంగా అవి వాళ్లను నిరుద్యోగులనుగా చేస్తూ వుంటాయి. యీ తొలగింపబడిన "చేతులు" పెట్టుబడి ఉపయోగార్థం నిజమైన రిజర్వు పారిశ్రామిక సైన్యంగా యేర్పడతాయి. వర్తకం అధ్వాన్నంగా వుంటే, వాళ్లు పస్తు వుండవచ్చు, బిచ్చమె

త్తుకోవచ్చు, దొంగిలించవచ్చు, లేదా వర్క్ హౌస్‌కు[4] పోవచ్చు. వర్తకం బాగుంటే, ఉత్పత్తిని విస్తరించడానికి వాళ్ళు అందుబాటులో వుంటారు. యీ రిజర్వు సైన్యంలోని చివరి పురుషునికీ, స్త్రీకీ, లేదా బాలునికీ, బాలికకూ పని దొరికిందాకా — ఆదుర్దాతో కూడిన అధికోత్పత్తి సమయాలలో మాత్రమే అలా దొరుకుతుంది — అందాకా యీ సైన్యపు పోటీ వేతనాలను తగ్గించి వుంచుతుంది; కేవలం తన ఉనికివల్లనే, శ్రమతో పెట్టుబడి చేసే పోరాటంలో, పెట్టుబడి శక్తిని బలీయం చేస్తుంది. పెట్టుబడితో జరిగే పరుగు పందెంలో శ్రమకు అసౌకర్యం వుండడమే కాదు, అది తన కాలికి అతికించబడిన ఫిరంగి గుండును లాగవలసివుంది. కానీ, పెట్టుబడిదారీ అర్థశాస్త్రం ప్రకారం అది న్యాయం.

మరి, యీ న్యాయమైన వేతనాలను పెట్టుబడిదార్లు యే నిధినుండి చెల్లిస్తారో తెలుసుకుందాం. సహజంగానే, పెట్టుబడినుండి. కానీ, పెట్టుబడి యే విలువనూ ఉత్పత్తి చేయదు. భూమి కాక, శ్రమ ఒక్కటే సంపదకు మూలం. పెట్టుబడి అనేదే శ్రమయొక్క కూడబెట్టబడిన ఉత్పత్తి తప్ప మరేమీ కాదు. అనగా శ్రమయొక్క వేతనాలు శ్రమనుండి చెల్లింపబడతాయి, కార్మికుడు తన ఉత్పత్తినుండే చెల్లింపబడతాడు. మామూలు న్యాయం అనబడేదాని ప్రకారం, శ్రామికుని శ్రమయొక్క ఉత్పత్తి అతని కూలిగా వుండాలి. కానీ, అర్థశాస్త్రం ప్రకారం అది న్యాయం కాదు. తద్వ్యతిరేకంగా, కార్మికుని శ్రమయొక్క ఉత్పత్తి పెట్టుబడిదారునికి పోతుంది, కార్మికునికి కేవల జీవితావసర వస్తువులకంటె యెక్కువ యేమీ రాదు. యీవిధంగా, పోటీ అనే యీ అసాధారణంగా "న్యాయమైన" పరుగుపందెపు అంతం యేమిటంటే, పనిచేసేవాళ్ల శ్రమ ఉత్పత్తి పనిచేయనివాళ్ల చేతుల్లో అనివార్యంగా ప్రోగై, వాళ్ల చేతుల్లో, దానిని యెవరు ఉత్పత్తి చేసినారో అదే మనుషులనే బానిసలను చేయడానికి అత్యంత శక్తివంతమైన సాధనంగా తయారౌతుంది.

న్యాయమైన రోజు పనికి న్యాయమైన రోజు కూలి! న్యాయమైన రోజు పనిని గురించి కూడా చాలా చెప్పవచ్చు; దాని న్యాయం కూలియొక్క న్యాయానికి సంపూర్ణంగా సమాన స్థాయిలో వుంది. కానీ దానిని మరొకసారి చూద్దాం. యిప్పుడు చెప్పినదాన్నిబట్టే, పాత నినాదానికి కాలం తీరిందనీ, ప్రస్తుతం వర్తించదనీ చాలా స్పష్టపడుతున్నది. అర్థశాస్త్రం యొక్క న్యాయం, వాస్తవ సమాజాన్ని పాలించే నియమాలను నిజంగా నిర్ణయించడానికి సంబంధించిన న్యాయం, ఆ న్యాయం అంతా ఒక పక్షాన వుంది — పెట్టుబడి పక్షాన. కనుక, పాత నినాదం శాశ్వతంగా పూడ్చిపెట్టబడనీ, దాని స్థానంలో యీ మరొక సూత్రం రానీ: శ్రమ సాధనాలు — ముడి సరుకులూ, ఫాక్టరీలూ, యంత్రాలూ — కార్మికులకే చెందడం!

*The Labour Standard* (London),
నం. 1, మే 7, 1881

# వేతన వ్యవస్థ

యింతకు ముందు రాసిన ఒక వ్యాసంలో మనం "న్యాయమైన రోజు పనికి న్యాయమైన రోజు కూలి" అనే సంప్రదాయ సమున్నతమైన వినాదాన్ని పరిశీలించి, ప్రస్తుత సాంఘిక పరిస్థితులలో అత్యంత న్యాయమైన రోజు కూలి అత్యంత అన్యాయంగా కార్మికుని ఉత్పత్తిని పంచుకోడానికి అవశ్యంగా సమానమనే నిర్ణయానికి వచ్చినాము; ఆ ఉత్పత్తిలో అధిక భాగం పెట్టుబడిదారుని జేబులోకి పోతుంది, కార్మికుడు తన్ను తాను పనిచేసే స్థితిలో వుంచుకోడానికీ, వంశవృద్ధికీ సరిగా వీలు కలిగించేటంత మాత్రంతో అవస్థ పడాలి.

యిది అర్థశాస్త్ర నియమం, లేదా, మరొక విధంగా చెప్పాలంటే, సమాజంయొక్క ప్రస్తుత ఆర్థిక నిర్మాణపు నియమం; యింగ్లండుయొక్క కామన్‌లా, శ్టాట్యూట్‌లా, చాన్సరీ కోర్టుతో సహా, అన్నీ కలిసినా వున్నంతకంటె శక్తివంతమైనది యీ నియమం. సమాజం పరస్పరం వ్యతిరేకించే రెండు వర్గాలుగా విభజింపబడి వుండగా — ఒక వైపున పెట్టుబడిదార్లు, ఉత్పత్తి సాధనా లన్నిటియొక్క, భూమీ, ముడి సరుకులూ, యంత్రాలూ అన్నిటియొక్క, గుత్తాధిపతులు; మరొకవైపున కార్మికులు, ఉత్పత్తి సాధనాలలో బొత్తిగా ఆస్తి లేకుండా చేయబడినవాళ్లు, తమ శ్రమ శక్తి తప్ప దేనికీ యజమానులు కానివాళ్లు; యీ సమాజ నిర్మాణం వుండగా వేతన నియమం సర్వశక్తివంతంగా నిలుస్తుంది; వేటితో కార్మికుడు తన సొంత ఉత్పత్తికి, పెట్టుబడిదారునిచేత గుత్తహక్కుగా చేసుకోబడినట్టిదానికి, బానిసగా చేయబడినాడో ఆ గొలుసులను రోజూ కొత్తగా అది బిగిస్తుంది.

యీ దేశపు ట్రేడ్ యూనియన్లు యిప్పటికి దాదాపు అరవై యేండ్లుగా యీ నియమానికి వ్యతిరేకంగా పోరాడినాయి. ఫలితం యేమిటి? అవి కార్మికవర్గాన్ని, తన సొంత చేతుల ఉత్పత్తి అయిన పెట్టుబడికింద దాస్యంనుండి, విముక్తి చేయగలిగినాయా? కార్మికవర్గంలో ఒక్కగావొక్క భాగాన్నైనా కూలి బానిసల స్థితిని అధిగమించేటట్లూ, తమ సొంత ఉత్పత్తి సాధనాలకు, తమ వృత్తిలో అవసరమైన ముడి సరుకులకూ, పనిముట్లకూ, యంత్రాలకూ, యజమాను లయ్యేటట్లూ, తద్వారా తమ సొంత శ్రమయొక్క ఉత్పత్తికి యజమాను లయ్యేటట్లూ అవి చేయగలిగినాయా? అవి అలా చేయకపోవడమే కాక, ఆ ప్రయత్నం కూడా యెప్పుడూ చేయలేదని అందరికీ తెలుసు.

ట్రేడ్ యూనియన్లు ఆ పని చేయలేదు గనుక అవి నిరుపయోగమని మనం అనకూడదు. తద్విరుద్ధంగా, యింగ్లండులో, ప్రతి యితర పారిశ్రామిక దేశంలోనూ, కార్మికవర్గాలు పెట్టుబడితో చేసే పోరాటంలో ట్రేడ్ యూనియన్లు అవసరం. సగటు కూలి రేటు ఒక నిర్దిష్ట దేశంలోని కార్మిక జాతిని, ఆ దేశంలో మామూలుగా వున్న జీవన ప్రమాణాన్ని అనుసరించి, కొనసాగించడానికి చాలిన జీవితావసరాల మొత్తానికి సమానం. ఆ జీవన ప్రమాణం కార్మికులలో భిన్న వర్గాలకు చాలా భిన్నంగా వుండవచ్చు. ట్రేడ్ యూనియన్లు కూలి రేటును యథాతథంగా వుంచడానికీ, పని గంటలను తగ్గించడానికీ చేసే పోరాటంలో వాటి గొప్ప సుగుణం యేమిటంటే, అవి జీవన ప్రమాణాన్ని యథాతథంగా వుంచడానికీ, యెక్కువ చేయడానికీ అభిముఖంగా వుంటాయి. బేల్దారీ పనివాళ్లూ, వాళ్లకింద కూలీలూ చేసే శ్రమ కంటె యెక్కువ నైపుణ్యం లేకుండా, అంతే కష్టమైన శ్రమ గల వృత్తులు లండన్ ఈస్టెండ్‌లో చాలా వున్నాయి; కానీ యీ వృత్తులలోని వాళ్లు పైవాళ్ల వేతనాలలో అర్ధం కూడా సంపాయించరు. యెందుకు? కేవలం, ఒక బృందం తమ వేతనాలను కొలిచే నియమంగా, సాపేక్షంగా ఉన్నత జీవన ప్రమాణాన్ని సాగించగలిగేటట్లు ఒక శక్తివంతమైన సంస్థ చేస్తుంది గనుక; మరొక బృందం, అసంఘటితమై, శక్తిహీనమై, తమ యజమానులు చేసే అనివార్యమైన దురాక్రమణలకే గాక, ఇష్టారాజ్యపు దురాక్రమణలకు కూడా లోబడవలసివుంది: వాళ్ల జీవన ప్రమాణం క్రమక్రమంగా తగ్గిపోతుంది, అంతకంతకూ తక్కువ వేతనాలమీద జీవించడం వాళ్లు నేర్చుకుంటారు, యే స్థాయి తమకు చాలునని వాళ్లే అంగీకరించడం నేర్చుకున్నారో ఆ స్థాయికి సహజంగా వాళ్ల వేతనాలు పడిపోతాయి.

కనుక, వేతనాల నియమం కచ్చితమైన గీత గీసేది కాదు. కొన్ని పరిమితులలో అది దుర్వారమైనది కాదు. ప్రతి సమయంలోనూ (గొప్ప మాంద్యంలో తప్ప), ప్రతి వృత్తికీ కొంత వెసులుబాటు వుంది; ఆ వెసులుబాటులో, రెండు ప్రత్యర్థి పక్షాల మధ్య జరిగే పోరాటపు ఫలితాలవలన, వేతనాల రేటును మార్చవచ్చు. ప్రతి సందర్భంలోనూ వేతనాలు బేరంద్వారా నిర్ణయింపబడతాయి; బేరంలో యెవడు అందరికంటె దీర్ఘంగా, బాగా నిగ్రహించుకోగలడో వాడు తనకు రావలసినదానికంటె యెక్కువ పొందడానికి అందరికంటె యెక్కువ అవకాశం కలిగివుంటాడు. ఏకాకి కార్మికుడు పెట్టుబడిదారునితో తాను కోరిన బేరం కుదిరించుకోడానికి ప్రయత్నిస్తే, వాడు సులభంగా ఓడిపోయి, ఐచ్ఛికంగా లొంగవలసి వుంటుంది. కానీ ఒక వృత్తిలోని మొత్తం కార్మికులు ఒక శక్తివంతమైన సంస్థగా యేర్పడి, అవసరమైతే తమ యజమానులను ధిక్కరించడానికి తమకు వీలు కలిగించే నిధిని తమనుండే వసూలుచేసి, తద్వారా, యీ యజమానులతో ఒక శక్తిగా వ్యవహరించే సామర్థ్యం కలిగివుంటే, అప్పుడు, అప్పుడు మాత్రమే, ప్రస్తుత సమాజపు ఆర్థిక నిర్మాణం ప్రకారం న్యాయమైన రోజు

పనికి న్యాయమైన రోజు కూలి అనదగిన ఆ ముష్టి డబ్బులైనా పొందే అవకాశం వుంటుంది వాళ్లకు.

ట్రేడ్ యూనియన్ల పోరాటాలవలన వేతనాల నియమం తలకిందులు కాదు. తద్విరుద్ధంగా, వాటివలన అది అమలుపరచబడుతుంది. ట్రేడ్ యూనియన్ల ప్రతిఘటన లేకుండా, వేతనాల వ్యవస్థయొక్క నియమాల ప్రకారం శ్రామికునికి రావలసింది కూడా రాదు. తన కనులముందు వున్న ట్రేడ్ యూనియన్ భయంచేత మాత్రమే పెట్టుబడిదారుడు తన శ్రామికుని శ్రమ శక్తియొక్క పూర్తి మార్కెట్ విలువను యిచ్చేటట్లు చేయబడతాడు. దీనికి రుజువు కావాల్నా? పెద్ద ట్రేడ్ యూనియన్ల సభ్యులకు చెల్లించే వేతనాలూ, ఆ దౌర్భాగ్యపు మురికి గుంట అయిన లండన్ ఈస్టెండ్‌లోని అసంఖ్యాకపు చిన్న వృత్తులకు చెల్లించే వేతనాలూ చూడండి.

ఆ విధంగా, ట్రేడ్ యూనియన్లు వేతనాల వ్యవస్థమీద దాడిచేయవు. కార్మికవర్గపు ఆర్థిక పతనం జరిగేది వేతనాల యెక్కువవలనా, తక్కువవలనా కాదు: యీ పతనం యెందులో వుందంటే, కార్మికవర్గం తన శ్రమకు ఆ శ్రమయొక్క పూర్తి ఉత్పత్తిని పొందడానికి బదులు, తన సొంత ఉత్పత్తిలోని ఒక భాగంతో, వేతనాలు అనబడేదానితో, తృప్తిపడవలసి రావడంలో వుంది. పెట్టుబడిదారుడు శ్రమ సాధనాల యజమాని గనుక, అతను మొత్తం ఉత్పత్తిని జేబులో వేసుకుంటాడు (అందులోనుండి కార్మికునికి చెల్లిస్తూ). కనుక, కార్మిక వర్గం శ్రమ సాధనాలన్నిటికీ — భూమీ, ముడి సరుకులూ, యంత్రాలూ, వగైరాలకు — యజమాని అయిందాకా, తద్వారా తన సొంత శ్రమయొక్క మొత్తం ఉత్పత్తికి యజమాని అయిందాకా, దానికి మోక్షం లేదు.

*The Labour Standard* (London),
నం. 3, మే 21, 1881

# ట్రేడ్ యూనియన్లు I

ట్రేడ్ యూనియన్లు పెట్టుబడిదార్లకు వ్యతిరేకంగా వేతనాల ఆర్థిక నియమాన్ని అమలుపరిచే టంతవరకు వాటి చర్యను మనం గత సంచికలో పరిశీలించినాము. ఆ విషయానికి తిరిగివస్తున్నాము; యెందుకంటే, కార్మికవర్గాలు దానిని ఆమూలాగ్రం అర్థంచేసుకోవడం అత్యంత ముఖ్యం గనుక.

వేతనాలను యెంత వీలైతే అంత తగ్గించడం ఒక్కొక పెట్టుబడిదారునికీ, మొత్తంమీద పెట్టుబడిదారీ వర్గానికీ ప్రయోజనమని యీనాటి యింగ్లీషు కార్మికునికి నేర్ప నవసరం లేదనుకుంటాను. డేవిడ్ రికార్డో తిరుగులేకుండా రుజువుచేసినట్లు, శ్రమయొక్క ఉత్పత్తి, అందులోనుండి ఖర్చులన్నీ తీసివేసిన తర్వాత, రెండు భాగాలుగా విభజింపబడుతుంది: ఒక భాగం శ్రామికుని కూలి ఔతుంది, మరొక భాగం పెట్టుబడిదారుని లాభం ఔతుంది. మరి, విడివిడిగా ప్రతి సందర్భంలోనూ, శ్రమయొక్క నికర ఉత్పత్తి నియమిత పరిమాణంగా వుంటుంది గనుక, కూలి అనబడే భాగం తగ్గకుండా, లాభం అనబడే భాగం యెక్కజాలదనేది స్పష్టం. కూలి తగ్గించడం పెట్టుబడిదారుని ప్రయోజనమని నిరాకరించడం తన లాభాలు యెక్కువచేసుకోవడం అతని ప్రయోజనం కాదనడంతో సమానమౌతుంది.

లాభాలను తాత్కాలికంగా యెక్కువచేసే యితర మార్గాలు వున్నాయని మనకు బాగా తెలుసు. కానీ అవి సాధారణ నియమాన్ని మార్చవు. కనుక యిక్కడ అవి మనల్ని బాధించవు.

మరి, కూలి రేటు ఒక స్పష్టమైన, కచ్చితమైన అర్థశాస్త్ర నియమంచేత పాలింప బడుతున్నప్పుడు, పెట్టుబడిదార్లు వేతనాలను యెలా తగ్గించగలరు? వేతనాల అర్థశాస్త్ర నియమం అనేది వుంది, అది కాదనరానిది. కానీ, మనం గమనించినట్లు, దానికి సాగే గుణం వుంది; రెండు విధాలుగా ఆ గుణం వుంది. ఒక ప్రత్యేక వృత్తిలో, ఆ వృత్తిలోని కార్మికులను తక్కువ జీవన ప్రమాణానికి క్రమక్రమంగా అలవాటుపరచడంద్వారా ప్రత్యక్షంగా గానీ, లేక జీతం యెక్కించకుండా రోజువారీ పని గంటలను (లేదా, అదే పని గంటలలో పనియొక్క తీవ్రతను) యెక్కించడంద్వారా పరోక్షంగా గానీ, కూలి రేటును తగ్గించవచ్చు.

తన కార్మికుల వేతనాలను తగ్గించడంద్వారా తన లాభాలను యెక్కువచేసుకోవాలని విడివిడిగా ప్రతి పెట్టుబడిదారునికీ వుండే ప్రయోజనానికి, అదే వృత్తిలోని పెట్టుబడి

దార్లలో ఒకరికొకరికి వుండే పోటీ మూలంగా కొత్త ప్రేరణ లభిస్తుంది. వాళ్లలో ప్రతి వొకడూ తన పోటీదార్లకంటె తక్కువ ధరలకు తన సరుకులు అమ్మాలని ప్రయత్నిస్తాడు. మరి అతను తన లాభాలను త్యాగం చేయకపోతే, వేతనాలను ప్రయత్నించి తగ్గించాలి. ఆవిధంగా, కూలి రేటుమీద విడివిడిగా ప్రతి పెట్టుబడిదారుని ప్రయోజనమూ తెచ్చే ఒత్తిడి వాళ్లలోని పోటీవలన పది రెట్లు యెక్కువ ఔతుంది. యింతకుముందు దాదాపు లాభానికి సంబంధించిన విషయంగా వుండింది యిప్పుడు అవసర మౌతుంది.'

సంస్థాబద్ధం కాని కార్మికులకు యీ నిత్య, నిరంతర ఒత్తిడికి వ్యతిరేకంగా ప్రయోజనకరమైన ప్రతిఘటన మార్గం లేదు. కనుక, కార్మికుల సంస్థా నిర్మాణం లేని వృత్తులలో, వేతనాలు నిత్యం పడిపోవడానికి అభిముఖంగా వుంటాయి, పని గంటలు నిత్యం పెరగడానికి అభిముఖంగా వుంటాయి. నిదానంగా, కానీ నిశ్చయంగా, యీ ప్రక్రియ సాగుతూవుంటుంది. సౌభాగ్యపు కాలాలు అప్పుడప్పుడు దీనికి అంతరాయం కలిగించవచ్చు, కానీ హీన వర్తకం గల కాలాలు దానిని తరువాత మరింతగా త్వరపరుస్తాయి. కార్మికులు అంతకంతకూ తక్కువ జీవన ప్రమాణానికి క్రమక్రమంగా అలవాటుపడతారు. పని దినపు దైర్ఘ్యం సాధ్యమైన గరిష్ఠ స్థాయిని అంతకంతకూ సమీపిస్తుంది, వేతనాలు తమ పరమ కనిష్ఠ స్థాయికి అంతకంతకూ దగ్గరగా వస్తాయి—యే మొత్తానికి తక్కువగా కార్మికుడు బతకడానికీ, వంశోత్పత్తి చేసుకోడానికీ పరమ అసాధ్యమౌతుందో ఆ మొత్తానికి దగ్గరగా వస్తాయి.

దాదాపు యీ శతాబ్ది ప్రారంభంలో, దీనికి ఒక తాత్కాలిక అపవాదం వుండింది. ఆవిరియొక్క, యంత్రాలయొక్క సత్వర విస్తరణ వాటి ఉత్పత్తుల కొరకు అంతకంటె వేగంగా పెరుగుతున్న డిమాండుకు చాలలేదు. యీ వృత్తులలోని వేతనాలు, వర్క్ హౌస్‌నుండి ఉత్పత్తిదారునికి అమ్మబడిన పిల్లల వేతనాలు తప్ప, మామూలుగా యెక్కువగా వుండినాయి; యేది లేకుంటే పని జరగదో అలాంటి నిపుణ చేతి పనియొక్క వేతనాలు చాలా యెక్కువగా వుండినాయి; రంగులద్దేవానికీ, మెకానిక్కుకూ, వెల్వెట్ కత్తిరించేవానికీ, మగ్గంమీద పనిచేసేవానికీ వస్తూవుండిన వేతనాలు యిప్పుడు అచ్చెరువు కలిగిస్తాయి. అదే సమయంలో యంత్రాలచేత తొలగించివేయబడిన వృత్తులు నిదానంగా చచ్చిపోతూ వుండినాయి. కానీ కొత్తగా సృష్టించబడిన యంత్రాలు త్వరలోనే ఆ మంచి జీతాలు వచ్చే కార్మికులను తొలగించి వేసినాయి. యంత్రాలను తయారుచేసే యంత్రాలు సృష్టించబడినాయి; యంత్రాలు యెంత వేగంతో సృష్టించబడినాయంటే, ఆ యంత్రాలచేత తయారైన సరుకులు డిమాండుకు సమానంగా వుండడమే కాక, యెక్కువగా వుండినాయి. 1815లో సార్వత్రిక శాంతి వర్తక క్రమత్వాన్ని పునస్థాపించినప్పుడు సౌభాగ్యానికీ, అమితోత్పత్తికీ, వర్తక భయస్థితికీ మధ్య దశవర్ష యెగుడు దిగుడులు ప్రారంభమైనాయి. కార్మికులు పాత సౌభాగ్యపు కాలాలనుండి

నిలుపుకున్న, బహుశా ఆదుర్దాతో కూడిన అమితోత్పత్తి కాలంలో యెక్కువ కూడా చేసుకున్న సౌకర్యాలు అన్నీ, హీన వర్తకమూ, భయస్థితీ వున్న కాలంలో వాళ్లనుండి తీసుకోబడినాయి. త్వరలోనే యింగ్లండులోని ఉత్పత్తిచేసే జనాభా సంస్థాబద్ధం కాని శ్రమయొక్క వేతనాలు పరమ కనిష్ఠ స్థాయికి పోవడానికి అభిముఖంగా వుంటాయనే సాధారణ నియమానికి లొంగిపోయింది.

యీమధ్యలో, 1824లో చట్టబద్ధం చేయబడిన ట్రేడ్ యూనియన్లు కూడా రంగంలో ప్రవేశించివుండినాయి; అవి ప్రవేశించవలసిన సమయం కూడా వచ్చివుండింది. పెట్టుబడిదార్లు యెల్లప్పుడూ సంఘటితంగా వుంటారు. అత్యధిక సందర్భాలలో వాళ్లకు లాంఛనపూర్వకమైన సంఘమూ, నిబంధనావళీ, అధికారపదవులూ, వగైరా అక్కరలేదు. వాటి స్థానంలో, కార్మికులతో పోలిస్తే వాళ్ల కుండే స్వల్ప సంఖ్యా, వాళ్లు విడిగా ఒక వర్గంగా వుండడమూ, సాంఘికంగా, వర్తకరీత్యా వాళ్ల నిత్య పరస్పర సంబంధమూ వాళ్లకు ఉపయోగపడతాయి. తరువాతి కాలంలో మాత్రమే, లాంకషైరును జవులీ వర్తకం వశపరుచుకున్నట్లు ఉత్పత్తిదారులలో ఒక శాఖ ఒక జిల్లాను వశపరుచుకున్నప్పుడు, లాంఛనపూర్వకమైన పెట్టుబడిదార్ల ట్రేడ్ యూనియన్ అవసరవౌతుంది. మరోవైపున కార్మికులకు మొట్టమొదటినుండి బలమైన సంస్థ, నిబంధనావళిచేత కచ్చితమైనదీ, తన అధికారాన్ని ఉద్యోగులకూ, కమిటీలకూ దత్తం చేసేదీ, లేకుండా పని జరగదు. 1824 నాటి చట్టం యీ సంస్థలను చట్టబద్ధం చేసింది. ఆనాటినుండి యింగ్లండులో శ్రమ ఒక శక్తి అయింది. అంతకుముందు అసహాయంగా వుండిన సమూహం, పరస్పర వ్యతిరేకమైన భాగాలుగా విభజింపబడివుండింది, అప్పుడిక యెంతమాత్రమూ అలా లేదు. ఏకీకరణవలనా, సమష్టిచర్యవలనా కలిగిన బలానికి భర్తీ అయిన ఖజానా — మన ఫ్రెంచి సోదరులు అర్థపూర్ణంగా అన్నట్లు, "ప్రతిఘటన నిధి" — యొక్క శక్తి తోడైంది. అప్పుడు మొత్తం పరిస్థితి మారిపోయింది. వేతనాలు తగ్గించడం గానీ, పని గంటలు పెంచడం గానీ పెట్టుబడిదారునికి ప్రమాదంతో కూడిన పని అయింది.

కనుకనే ట్రేడ్ యూనియన్లమీద ఆ కాలంనాటి పెట్టుబడిదారీ వర్గం తీవ్రంగా మండిపడడం. ఆ వర్గం కార్మికవర్గాన్ని నేల రాచే తన చిరకాలపు అలవాటును తన స్థిర హక్కుగానూ, చట్టబద్ధమైన సౌకర్యంగానూ యెల్లప్పుడూ భావించింది. అప్పుడది ముగియవలసి వచ్చింది. వాళ్లు నోరారా కేకలు వేయడమూ, యీనాడు ఐరిష్ భూస్వాములు చేస్తున్నట్లు,[6] తమ హక్కులకూ, ఆస్తికీ భంగం కలిగిందని వాళ్లు భావించడమూ ఆశ్చర్యం కలిగించదు.

అరవై యేండ్ల పోరాటం వాళ్లను కొంతవరకు రాజీ స్థితికి తెచ్చింది. ట్రేడ్ యూని

యన్ను యిప్పుడు అంగీకరించబడిన సంస్థలు అయినాయి; ఫాక్టరీల, వర్కుషాపుల చట్టాల చర్య పని గంటలను సరిదిద్దేదిగా యెంతగా గుర్తింపబడుతున్నదో, పూర్తిగా అంతగా ట్రేడ్ యూనియన్ల చర్య వేతనాలను సరిదిద్దేవాటిల్లో ఒకటిగా గుర్తింపబడుతున్నది. కాదు, లాంకషైర్ జవుళీ ప్రభువులు యిటీవల కార్మికులనుండి ఒక పాఠం నేర్చుకున్నారు కూడా; తమకు అనుకూలంగా వున్నప్పుడు, యే ట్రేడ్ యూనియన్‌తోనైనా సమానంగా, లేదా అంతకంటె బాగా, సమ్మెను యేర్పాటుచేయడం యిప్పుడు వాళ్లకు తెలుసు.

యీవిధంగా ట్రేడ్ యూనియన్ల చర్యద్వారానే పెట్టుబడిదార్లకు వ్యతిరేకంగా వేతనాల నియమం అమలుపరచబడడమూ; యే సుసంఘటితమైన వృత్తిలోనైనా వున్న కార్మికులు తమ యజమానికి అద్దెకిచ్చే శ్రమ శక్తియొక్క పూర్తి విలువను, కనీసం రమారమిగానైనా, పొందగలగడమూ; పని గంటలు యే గరిష్ఠ దైర్ఘ్యాన్ని దాటితే శ్రమ శక్తి తన కాలానికి ముందే వ్యయమైపోతుందో ఆ గరిష్ఠ దైర్ఘ్యాన్ని కనీసం మితిమీరి దాటకుండా వుండేటట్లు, ప్రభుత్వ శాసనాల సహాయంతో, చేయబడడమూ. కానీ ట్రేడ్ యూనియన్లు, ప్రస్తుతం సంఘటితమైన స్థితిలో, పొందడానికి ఆశించగల గరిష్ఠం యిది; యిది కూడా అపారమైన బలమూ, ధనమూ వృధాచేయడంద్వారా. తర్వాత, కనీసం ప్రతి పదేండ్లకూ ఒకసారి వచ్చే వర్తకపు యెగుడుదిగుడులు అంతవరకు జయించబడినదానిని తాత్కాలికంగా భగ్నం చేస్తాయి, పోరాటం మళ్లీ మొదలంట చేయవలసి వస్తుంది. బయటికి దారి లేని విషవలయం యిది. కార్మికవర్గం గతంలో యెలా వుండిందో అలాగే వుంటుంది, మన చార్టిస్టు పూర్వీకులు అనడానికి భయపడనట్లు, కూలి బానిసల వర్గంగా వుంటుంది. యీ సమస్త శ్రమకూ, స్వార్థత్యాగానికీ, బాధకూ యిదేనా అంతిమ ఫలితం? బ్రిటిష్ కార్మికులకు యిది శాశ్వతంగా అత్యున్నత లక్ష్యంగా వుండవలసిందేనా? లేక, యీ దేశపు కార్మికవర్గం చివరకు యీ విష వలయాన్ని ఛేదించడానికి ప్రయత్నించి, వేతనాల వ్యవస్థనే పూర్తిగా రద్దుచేయడానికి చేసే ఉద్యమంలో దానిలోనుండి బయటికి దారిని కనుక్కోవలసి వుందా?

వచ్చే వారం కార్మికవర్గ ఆర్గనైజర్లుగా ట్రేడ్ యూనియన్లు నిర్వహించిన పాత్రను పరిశీలించుదాం.

*The Labour Standard* (London),
నం. 4, మే 28, 1881

# ట్రేడ్ యూనియన్లు II

ట్రేడ్ యూనియన్లు కూలి రేటును సరిదిద్దడానికి తోడ్పడి, శ్రామికుడు పెట్టుబడితో చేసే పోరాటంలో అతనికి యేదో ఒక ప్రతిఘటన మార్గాన్ని నిస్సందేహపరిచే టంత వరకు మాత్రమే మనం యింతవరకు ట్రేడ్ యూనియన్ల పనులను పరిశీలించినాము. కానీ ఆ అంశంతో మన విషయం ముగిసిపోదు.

పెట్టుబడితో శ్రామికుడు చేసే పోరాటం, అన్నాము. ఆ పోరాటం వుంది, తద్విరుద్ధంగా పెట్టుబడి సమర్థకులు యేమి చెప్పినప్పటికీ. కూలి రేటు తగ్గింపు లాభాల హెచ్చింపుకు అత్యంత సురక్షితమైన, అందుబాటులో వున్న మార్గంగా వున్నంతవరకు వుంటుంది. అంతే కాకుండా, వేతన వ్యవస్థ అనేదే వున్నంతవరకు అది వుంటుంది. ట్రేడ్ యూనియన్లు వుండడమే దానికి తగినంత నిదర్శనం. అవి పెట్టుబడియొక్క దురాక్రమణలతో పోరాడడానికి కాకపోతే, యెందుకు సృష్టింపబడినట్లు? విషయాలను మూసిపెట్టడంవల్ల ప్రయోజనం లేదు. ప్రస్తుత సమాజం ప్రధానంగా రెండు గొప్ప శత్రు వర్గాలుగా విభజింపబడింది — ఒకవైపున శ్రమను వినియోగించుకోడానికి సకల సాధనాలకూ యజమానులైన పెట్టుబడిదార్లుగానూ, మరొకవైపున తమ సొంత శ్రమ శక్తికి తప్ప దేనికీ యజమానులు కాని కార్మికులుగానూ; యీ వికృత వాస్తవాన్ని మెత్తని మాటలు యేవీ దాచలేవు. కార్మికవర్గపు శ్రమయొక్క ఉత్పత్తి రెండు వర్గాలమధ్యా విభజింపబడవలసి వుంది; యీ విభజనగురించే పోరాటం నిత్యం సాగుతున్నది. ప్రతి వర్గమూ సాధ్యమైనంత పెద్ద భాగం పొందడానికి ప్రయత్నిస్తుంది; మరి, యీ పోరాటంలోని అత్యంత చిత్రమైన విషయం యేమిటంటే, కార్మికవర్గం, తన సొంత ఉత్పత్తిలో ఒక భాగం పొందడానికి మాత్రమే పోరాడుతుండగా, వాస్తవంగా పెట్టుబడిదారుని దోచుకుంటున్నట్లు తరుచుగానే నిందింపబడుతున్నది!

కానీ, సమాజంలోని రెండు గొప్ప వర్గాలమధ్య పోరాటం విధిగా రాజకీయ పోరాటం ఔతుంది. మధ్య తరగతికీ, లేక పెట్టుబడిదారీ వర్గానికీ, భూస్వామ్య ప్రభువర్గానికీ మధ్య జరిగిన దీర్ఘ యుద్ధం అలా అయింది; కార్మికవర్గానికీ, అదే పెట్టుబడిదార్లకూ మధ్య జరిగే పోరాటం కూడా అలాగే ఔతుంది. వర్గానికీ వర్గానికీ మధ్య జరిగే ప్రతి పోరాటంలోనూ,

తరువాతి కొంత కాలం తన రాజకీయ అధికారం కొరకు పోరాడింది; పాలక వర్గం తన రాజకీయ ఆధిపత్యాన్ని, అనగా శాసనసభలో తన గట్టి మెజారిటీని, రక్షించుకోడానికి పోరాడుతుంది; కింది వర్గం, అప్పుడున్న శాసనాలను తమ ప్రయోజనాలకూ, అవసరాలకూ అనుగుణంగా మార్చే శక్తి పొందడానికి, మొదట ఆ అధికారంలో కొంత భాగం కొరకూ, తరువాత మొత్తం అధికారం కొరకూ పోరాడుతుంది. ఆవిధంగా గ్రేట్ బ్రిటన్‌యొక్క కార్మికవర్గం తనకు ఆ రాజకీయ అధికారాన్ని యిచ్చే ప్రజా హక్కుల పత్రం[7] కొరకు అనేక సంవత్సరాల పాటు దీక్షగా, భీషణంగా కూడా, పోరాడింది. అది ఓడిపోయింది, కానీ ఆ పోరాటం విజేత బూర్జువా వర్గంమీద యెలాంటి ముద్ర కలిగించిందంటే, ఆ బూర్జువావర్గం కార్మిక జనానికి పదేపదే యిచ్చే రాయితీలు అనే ఖరీదుతో దీర్ఘ యుద్ధ విరమణను అతి సంతోషంగా కొనింది.

వర్గానికీ వర్గానికీ మధ్య జరిగే పోరాటంలో సంస్థా నిర్మాణం అత్యంత ముఖ్యమైన ఆయుధం. కేవల రాజకీయ, లేక చార్టిస్టు సంస్థ యేమేరకు ముక్కలైపోయిందో, ఆమేరకు ట్రేడ్ యూనియన్ల సంస్థ అంతకంతకూ బలంగా పెరిగి, ప్రస్తుతం విదేశాలలోని యే కార్మిక వర్గ సంస్థకూ లేనంత బలం పొందింది. కొద్దిపాటి పెద్ద ట్రేడ్ యూనియన్లు, పది లక్షలనుండి యిరవై లక్షలదాకా కార్మికులను కలిగి, అంతకంటె చిన్న, లేక స్థానిక యూనియన్లచేత బలపరచబడేవి, యెలాంటి శక్తికి ప్రాతినిధ్యం వహిస్తున్నాయంటే, ఆ శక్తిని పాలకవర్గంయొక్క యే ప్రభుత్వమైనా, విగ్ ప్రభుత్వమైనా, టోరీ ప్రభుత్వమైనా,[8] లెక్కలోకి తీసుకోవలసి వుంది.

యీ శక్తివంతమైన సంస్థలు, యీ దేశంలో తమ పుట్టుకకూ, అభివృద్ధికీ సంబంధించిన సంప్రదాయాలను బట్టి, వేతనాలనూ, పని గంటలనూ సరిదిద్దడంలో పాలుపంచుకోవడమూ, కార్మికులకు బాహాటంగా వ్యతిరేకంగా వున్న చట్టాల రద్దును అమలుపరచడమూ అనే తమ పనికి యింతవరకు దాదాపు కచ్చితంగా పరిమితమైనాయి. యింతకు ముందు చెప్పినట్లు, యెంత ఫలితాన్ని ఆశించడానికి వాటికి హక్కు వుందో, పూర్తిగా అంత ఫలితంతో అవి ఆ పని చేసినాయి. కానీ, అవి అంతకంటె యెక్కువ సాధించినాయి — వాటి శక్తిని వాటికంటె బాగా యెరిగిన పాలకవర్గం వాటికి అంతకు మించిన రాయితీలు ఐచ్ఛికంగా యిచ్చింది. డిజ్రేలీ చేసిన వోటు చట్టం[9] సంస్థాబద్ధ కార్మికవర్గంలో కనీసం అధిక భాగానికి వోటు హక్కు యిచ్చింది. యీ కొత్త వోటర్లు తమ సొంత యిచ్ఛను ప్రదర్శిస్తారని, బూర్జువావర్గం లిబరల్ రాజకీయవాదులచేత నడిపింపబడడం మానుకుంటారని, డిజ్రేలీ అనుకోకపోతే, అతను ఆ చట్టాన్ని ప్రతిపాదించేవాడా? కార్మిక జనం పరిపాలన పనికీ, రాజకీయ పనికీ తాము తగుదుమని, తమ బ్రహ్మాండమైన ట్రేడ్ సొసైటీల నిర్వహణలో రుజువు చేసివుండకపోతే, అతను ఆ చట్టాన్ని నెగ్గించగలిగి వుండేవాడా?

సరిగ్గా ఆ చట్టమే కార్మికవర్గానికి కొత్త అవకాశాలను ప్రసాదించింది. అది వాళ్లకు లండన్‌లోనూ, యితర పారిశ్రామిక పట్టణాలంలోనూ మెజారిటీ యిచ్చి, తన్మూలంగా, తమ సొంత వర్గపు మనుషులను పార్లమెంటుకు పంపడంద్వారా, కొత్త ఆయుధాలతో పెట్టుబడిమీద పోరాటంలో ప్రవేశించడానికి వాళ్లకు వీలు కలిగించింది. మరి యిక్కడ ట్రేడ్ యూనియన్లు కార్మికవర్గ అగ్రదళంగా తమ కున్న కర్తవ్యాన్ని మరిచిపోయినాయని చెప్పడానికి విచారిస్తున్నాము. యీ కొత్త ఆయుధం పదేండ్లకు పైగా వాళ్ల చేతుల్లో వుంది, కానీ వాళ్లు దానిని దాదాపు యెప్పుడూ ఒరలోనుండి బయటికి తీయలేదు. వాళ్లు నిజంగా కార్మికవర్గ అగ్రభాగాన నడిస్తే తప్ప, యిప్పుడు తమ కున్న స్థానాన్ని తాము నిలుపుకోలేము, అని వాళ్లు మరిచిపోకూడదు. ఇంగ్లండు కార్మికవర్గం నలభై, యాభై మంది కార్మికులను పార్లమెంటుకు పంపే శక్తి కలిగివుండడమూ, అయినా పెట్టుబడిదార్లూ, లేక వాళ్ల గుమాస్తాలైన లాయర్లూ, సంపాదకులూ వగైరాలూ తమకు ప్రాతినిధ్యం వహించడానికి శాశ్వతంగా తృప్తిపడడమూ అసహజమైనది.

అంతే కాదు. తాను కొంత కాలంగా తప్పు గాడిలో తిరుగుతున్నాననీ; కేవలం యెక్కువ వేతనాల కొరకూ, తక్కువ గంటల కొరకూ జరిగే ప్రస్తుత ఉద్యమాలు బయటికి దారి లేని విషవలయంలో తన్ను వుంచుతాయనీ; మౌలికమైన లోపం వేతనాలు తక్కువగా వుండడం కాదు, వేతనాల వ్యవస్థే, అనీ—యీ స్పృహకు యీ దేశపు కార్మికవర్గం మేలుకుంటున్న సూచనలు దండిగా వున్నాయి. యీ జ్ఞానం ఒకసారి కార్మికవర్గంలో సాధారణంగా వ్యాప్తి చెందితే, ట్రేడ్ యూనియన్ల స్థానం గణనీయంగా మారక తప్పదు. కార్మికవర్గంయొక్క ఏకైక సంస్థలుగా వుండే సౌకర్యం వాటికిక యెంత మాత్రమూ వుండదు. విడివిడి వృత్తుల యూనియన్ల పక్కన, లేదా వాటికిపైన, ఒక సాధారణ యూనియన్, మొత్తం కార్మిక వర్గంయొక్క రాజకీయ సంస్థ, ఆవిర్భవించకతప్పదు.

ఆవిధంగా, సంస్థాబద్ధ వృత్తులు పరిగణించవలసినవి రెండు అంశాలు వున్నాయి. మొదటిది, యీ దేశపు కార్మికవర్గం పార్లమెంటు ప్రాతినిధ్యంలో తన పూర్తి భాగాన్ని, పొరబడడానికి వీలులేని కంఠంతో, తన హక్కుగా కోరే సమయం వేగంగా సమీపిస్తున్న దనేది. రెండవది, యెక్కువ జీతాల కొరకూ, తక్కువ గంటల కొరకూ జరిగే పోరాటమూ, యిప్పుడు సాగించబడుతున్నట్టి ట్రేడ్ యూనియన్ల మొత్తం చర్యా దానిపాటి కదే ఒక లక్ష్యం కాదనీ, మరింత ఉన్నత లక్ష్యానికి—వేతనాల వ్యవస్థను పూర్తిగా రద్దుచేయడం అనే లక్ష్యానికి—ఒక సాధనం మాత్రమే, చాలా అవసరమైన, ప్రయోజనకరమైన సాధనం, కానీ అనేక సాధనాలలో ఒకటి మాత్రమే, అనీ కార్మికవర్గం గ్రహించివుండే సమయం కూడా వేగంగా సమీపిస్తున్న దనేది.

పార్లమెంటులో కార్మికుల పూర్తి ప్రాతినిధ్యం కొరకూ, వేతనాల వ్యవస్థ పూర్తి రద్దుకు సన్నాహం కొరకూ విడివిడిగా వృత్తులయొక్క సంస్థలు కాక, ఒకే మొత్తంగా కార్మికవర్గంయొక్క సంస్థలు అవసర మౌతాయి. యీ పని యెంత త్వరగా చేస్తే అంత మంచిది. బ్రిటిష్ కార్మికవర్గం ఒక సంఘంగా సంఘటితమైనప్పుడు, ఒక దినంపాటైనా దానిని ప్రతిఘటించగల శక్తి ప్రపంచంలో లేదు.

*The Labour Standard* (London),
నం. 5, జూన్ 4, 1881

# ఫ్రెంచి వాణిజ్య ఒప్పందం

జూన్ 9, గురువారం నాడు, కామన్స్ సభలో మంక్ (గ్లోసెస్టర్‌నుండి) ఒక తీర్మానం ప్రతిపాదించినాడు.

"ఫ్రాన్సుతో యే వాణిజ్య ఒప్పందమూ, సుంకాలలో మరింత తగ్గింపుద్వారా ఉభయ దేశాల వాణిజ్య సంబంధాల అభివృద్ధికి అభిముఖంగా లేనట్టిది, తృప్తికరంగా వుండదు," అని దాని తాత్పర్యం.

కొంత దీర్ఘమైన చర్చ జరిగింది. ప్రభుత్వం తరపున సర్ సి. డిల్క్ దౌత్య మర్యాదలకు అవసరమైన మెత్తని ప్రతిఘటన చేసినాడు. విదేశాలు తక్కువ సుంకాలు అవలంబించేటట్లు, ప్రతీకార సుంకాలద్వారా వాటిని నిర్బంధించా లంటాడు జె. ఎ. బాల్‌ఫోర్ (టామ్‌వర్త్‌నుండి). వాళ్లకు మన వర్తకపు విలువనూ, మనకు వాళ్ల వర్తకపు విలువనూ ఫ్రెంచివాళ్లు గ్రహించే టట్లు యే ఒప్పందమూ లేకుండా కూడా వదిలేయా లంటాడు స్లాగ్ (మాంచెస్టర్ నుంచి). వాణిజ్య ఒప్పందాలద్వారా నిర్నిబంధ వర్తకాన్ని అందుకోవడం గురించి ఈలింగ్వర్థ్ (బ్రాడ్‌ఫర్డ్‌నుంచి) నిస్పృహ ప్రకటించినాడు. ప్రస్తుత నిర్నిబంధ వర్తక వ్యవస్థ, నిర్ని బంధ దిగుమతులతోనూ, పరిమిత యెగుమతులతోనూ అది నిర్మింపబడింది గనుక, దగా మాత్రమే అని మెక్ ఐవర్ (బర్కెన్‌హెడ్‌నుంచి) ప్రకటించినాడు. తీర్మానం 49కి 77 వోట్లతో నెగ్గింది. యీ ఓటమి గ్లాడ్‌స్టన్ హృదయాన్ని గానీ, స్థానాన్ని గానీ బాధించదు.

నిర్నిబంధ వర్తకంయొక్క సార్వత్రిక వరాలనూ, ఆర్థిక బాధల నన్నిటినీ తొలగించగల దాని సామర్థ్యాన్నీ గుర్తించడానికి తెలివి తక్కువ విదేశీయుడు, పూర్తిగా అంతే తెలివి తక్కువ వాడైన వలస పౌరుడు కూడా, యే మొండితనంతో నిరాకరిస్తారో ఆ మొండితనం గురించి నిత్యం వచ్చే ఫిర్యాదుల దీర్ఘ పరంపరకు యీ చర్చ ఒక న్యాయమైన మచ్చు. నిర్నిబంధ వర్తకం ఒకసారి యింగ్లండులో స్థిరపడితే, దేశంమీద అది యెలాంటి వరాలు వర్షిస్తుందంటే, యితర దేశాలన్నీ ఆ ఆదర్శాన్ని అనుసరించి, యింగ్లీషు ఉత్పత్తిదార్లకు తమ రేవులు తెరచివుంచక తప్పదు, అని చెప్పిన మాంచెస్టర్ శాఖయొక్క[10] జోస్యం విఫల మైనంత సంపూర్ణంగా యెప్పుడూ యే జోస్యమూ విఫలం కాలేదు. నిర్నిబంధ వర్తక ప్రవక్తల బుజ్జ గింపు కంఠం అరణ్య రోదనం చేసే కంఠంగా నిలిచిపోయింది. మొత్తంమీద యూరపియన్

భూఖండమూ, అమెరికాలే కాదు తమ రక్షణ సుంకాలను యెక్కించింది; బ్రిటిష్ వలసలు కూడా వాటికి స్వపరిపాలన యివ్వబడిన వెంటనే, ఆ మార్గం అనుసరించినాయి; భారత దేశం రాజుకింద[11] వుంచబడిన వెంటనే, అక్కడ కూడా జవుళీ సరుకులమీద అయిదు శాతం సుంకం, దేశీయ ఉత్పత్తిదార్లకు ప్రోత్సాహంగా పనిచేసేది, విధించబడింది.

యెందు కిలా వున్నదీ మాంచెస్టర్ శాఖకు పరమ నిగూఢ విషయంగా వుంది. కానీ యిది స్పష్టంగానే వుంది.

గత శతాబ్ది మధ్యలో యింగ్లండు జవుళీ ఉత్పత్తికి ప్రధాన స్థానంగా వుండింది. కనుక అది, జవుళీ సరుకులకు వేగంగా పెరిగే డిమాండుతో, యంత్రాలు సృష్టింపబడ డానికి సహజ స్థలంగా వుండింది — యే యంత్రాలు ఆవిరి యింజను సహాయంతో మొదట జవుళీ వర్తకాన్నీ, క్రమంగా యితర బట్టల ఉత్పత్తులనూ విప్లవీకరించినాయో ఆ యంత్రాలు సృష్టింపబడడానికి. గ్రేట్ బ్రిటన్‌లోని పెద్ద, సులభంగా అందుబాటులో వున్న బొగ్గు గనులు, ఆవిరి మూలంగా, అప్పుడు దేశ సౌభాగ్యానికి ప్రాతిపదిక అయినాయి. బొగ్గుకు సమీ పంలో వున్న విస్తారమైన ముడి యినుము నిధులు యినుము వృత్తి అభివృద్ధికి వీలు కలి గించినాయి — యే యినుము వృత్తి యింజన్లకూ, యంత్రాలకూ వున్న డిమాండుద్వారా కొత్త ప్రోత్సాహం పొందిందో దాని అభివృద్ధికి. అప్పుడు, యావత్తు ఉత్పత్తి వ్యవస్థయొక్క యీ విప్లవం మధ్యలో, జాకొబిన్ వ్యతిరేక, నెపోలియానిక్ యుద్ధాలు వచ్చినాయి; అవి సుమారు యిరవై అయిదేండ్ల పాటు దాదాపు సకల పోటీ దేశాల ఓడలనూ సముద్రంనుండి తరిమివేసి, తద్వారా ఇంగ్లీషు పారిశ్రామిక సరుకులకు అట్లాంటిక్ మహాసముద్రం అవతల వున్న అన్ని మార్కెట్లమీదా, కొన్ని యూరపియన్ మార్కెట్లమీదా ఆచరణలో గుత్తాధి పత్యం యిచ్చినాయి. 1815లో శాంతి పునస్థాపించబడినప్పుడు, యితర దేశాలలో ఆవిరి యింజన్లు అప్పటికి దాదాపు బొత్తిగా తెలియకపోగా, యింగ్లండు తన ఆవిరి ఉత్పత్తులను ప్రపంచానికి సరఫరా చేయడానికి సిద్ధంగా వుండింది. యంత్రాల పరిశ్రమలో యింగ్లండు యితర దేశాలకంటె అపారంగా ముందు వుండింది.

కానీ శాంతి పునస్థాపన త్వరలో యితర జాతులను యింగ్లండు దారిని అనుసరించేటట్లు ప్రేరేపించింది. తన నిషేధాత్మక సుంకాల చైనా గోడచాటున సురక్షితంగా వుండి, ఫ్రాన్సు ఆవిరిద్వారా ఉత్పత్తిని ప్రవేశపెట్టింది. జర్మనీ కూడా అలాగే చేసింది, ఆ కాలంలో తన సుంకాలు యింగ్లండుతో సహా ప్రతి యితర దేశపు సుంకాలకంటె యెంతో ఉదారంగా వున్నప్పటికీ. యితర దేశాలు అలాగే చేసినాయి. అదే సమయంలో బ్రిటిష్ భూస్వామ్య ప్రభు వులు, తమ కౌళ్లను పెంచడానికి, ధాన్యం చట్టాలు[12] ప్రవేశపెట్టి, తద్వారా బ్రెడ్డు ధరనూ, దానితో పాటు డబ్బు రూపంలో యిచ్చే కూలి రేటునూ పెంచినారు. అయినప్పటికీ

యింగ్లీషు ఉత్పత్తిదార్ల పురోగమనం ప్రచండమైన వేగంతో సాగింది. 1830 నాటికి యింగ్లండు "ప్రపంచపు వర్క్‌షాపు" కావడానికి సకల ప్రయత్నాలూ చేసింది. దానిని వాస్తవంలో ప్రపంచపు వర్క్‌షాపుగా చేయడం ధాన్యం చట్టాల వ్యతిరేక లీగు[13] పూనుకున్న కర్తవ్యం.

ధాన్యం చట్టాల రద్దుద్వారా యేమి లక్షింపబడిందీ ఆ కాలంలో రహస్యంగా పెట్టలేదు. బ్రెడ్డు ధరను తగ్గించడమూ, తద్వారా డబ్బు రూపంలో యిచ్చే కూలి రేటును తగ్గించడమూ బ్రిటిష్ ఉత్పత్తిదార్లకు దుష్ట, లేక అజ్ఞానపు విదేశీయులు చేయబోయే ప్రతి పోటీనీ ధిక్కరించడానికి సామర్థ్యం యిస్తాయి. యింగ్లండు, యంత్రాలలో తన మహత్తర పురోగతితో, తన అపారమైన వాణిజ్య నౌకాదళంతో, తన బొగ్గుతో, యినుముతో, ప్రపంచ మంతటికీ పారిశ్రామిక వస్తువులు సరఫరా చేయడమూ, బదులుగా బయటి ప్రపంచం యింగ్లండుకు వ్యవసాయ సరుకులూ, ధాన్యమూ, ద్రాక్షసారాయి, ఫ్లాక్సూ, దూదీ, కాఫీ, టీ, వగైరా సరఫరా చేయడమూ — యింతకంటె సహజమైనది యేముంది? అది అలా వుండడం దైవాజ్ఞ. దానిని వ్యతిరేకించడం కేవలం దైవాజ్ఞమీద తిరుగుబాటు. మహా అయితే, నాజూకూ, ఫాషనూ గల వస్తువులు, యంత్రాలచేత తయారుకాజాలనివీ, విజ్ఞాన ప్రబుద్ధుడైన మిల్లు యజమాని దృష్టికి తగనివీ, యింగ్లండుకూ, యితర ప్రపంచానికీ ఫ్రాన్సును సరఫరా చేయనివ్వవచ్చు. అప్పుడు, అప్పుడు మాత్రమే, భూమండలంమీద శాంతీ, మానవులపట్ల సద్భావమూ వుంటాయి; అప్పుడు సకల జాతులూ వాణిజ్యమూ, పరస్పర లాభమూ అనే ప్రేమభరితమైన బంధనాలచేత యేక మౌతాయి; అప్పుడు శాంతి సమృద్ధుల రాజ్యం శాశ్వతంగా నెలకొల్పబడుతుంది. వాళ్ళు కార్మికవర్గంతో, వాళ్ల "చేతుల"తో యిలా అన్నారు: "అబ్బాయిలూ మంచి కాలం రాబోతున్నది — యిక కాస్త ఆగండి." "చేతులు" యింకా ఆగే వున్నాయి.

కానీ "చేతులు" ఆగగా, దుష్ట, అజ్ఞానపు విదేశీయులు ఆగలేదు. యింగ్లండుకు వుండిన తాత్కాలిక పారిశ్రామిక సౌకర్యాలు దానికి ప్రపంచ మంతటా శాశ్వతంగా ఉత్పత్తుల మీద గుత్తాధిపత్యం సంపాయించిపెట్టడానికీ, యితర జాతుల నన్నిటినీ యింగ్లండుమీద ఆధారపడే కేవల వ్యవసాయ జాతులుగా — మరోవిధంగా చెప్పాలంటే, చాలా అసూయపడదగిన ఐర్లండు స్థితికి — కుదించడానికీ సాధనాలుగా యే వ్యవస్థద్వారా మారుతాయో ఆ వ్యవస్థయొక్క అందాన్ని వాళ్ళు (విదేశీయులు) చూడలేదు. ఉత్పత్తులనుండి తొలగించబడితే, తద్వారా కేవలం పల్లెటూరు రైతుల సమూహపు స్థితికి దిగలాగబడితే, యే జాతీ నాగరికతలో యితర జాతులతో పాటు నిలువలేదని వాళ్లకు తెలుసు. కనుక వాళ్ళు వ్యక్తిగత వర్తక లాభాన్ని జాతీయ అవసరానికి లోబరిచి, తమ శైశవ ఉత్పత్తులను పెద్ద సుంకాలతో

రక్షించుకున్నారు; ఐర్లండు అనుభవించే ఆర్థిక స్థితికి దిగలాగబడకుండా తమ్మి తాము రక్షించుకోడానికి ఆ సుంకాలు యేకైక మార్గంగా వాళ్లకు కనిపించినాయి.

ప్రతి సందర్భంలోనూ యిది సరైన పనిగా వుండిందని చెప్పడం నా ఉద్దేశం కాదు. తద్విరుద్ధంగా, నిర్నిబంధ వర్తకాన్ని గణనీయంగా సమీపించడంద్వారా ఫ్రాన్సు అపారమైన సౌకర్యాలు పొందుతుంది. యిప్పుడున్న జర్మన్ ఉత్పత్తులు నిర్నిబంధ వర్తకంకింద యిప్పుడున్న స్థితికి వచ్చినాయి. బిస్మార్కుయొక్క నూతన రక్షణ సుంకాలు జర్మన్ ఉత్పత్తిదార్లకే తప్ప యెవరికీ హానిచేయవు. కానీ, కొద్ది కాలంపాటు రక్షణ సుంకాలు సమర్థనీయమే కాక, పరమ అవసరమైన దేశం ఒకటి వుంది — అమెరికా.

అమెరికా యిప్పుడు తన అభివృద్ధిలో యే దశలో వుందంటే, ఫాక్టరీలు ప్రవేశపెట్టడం జాతీయ అవసరం అయిన దశలో వుంది. శ్రమ కర్తన యంత్రాల సృష్టిలో అగ్రస్థానంలో వున్నది యిప్పుడిక యెంతమాత్రమూ యింగ్లండు కాదు, అమెరికా, అన్న విషయం దీన్ని అన్నిటికంటె బాగా రుజువుచేస్తుంది. అమెరికన్ సృజనలు ప్రతిరోజూ యింగ్లీషు పేటెంట్లనూ, యింగ్లీషు యంత్రాలనూ తొలగించివేస్తున్నాయి. అమెరికన్ యంత్రాలను యింగ్లండుకు తెస్తున్నారు; యిది దాదాపు అన్ని శాఖల ఉత్పత్తులలోనూ జరుగుతున్నది. యిక, అమెరికా కున్న జనాభా ప్రపంచంలో కెల్ల చురుకైనది; అమెరికా కున్న బొగ్గుగనులతో పోలిస్తే యింగ్లండువి దాదాపు శూన్యంగా కనిపిస్తాయి; అమెరికాకు యినుమూ, సకల యితర లోహాలూ సమృద్ధిగా వున్నాయి. మరి, అలాంటి దేశం, సుమారు యిరవై సంవత్సరాల స్వల్ప కాలిక రక్షణతో తన ఉత్పత్తులను వెంటనే యే పోటీదారునికైనా సమానమైన స్థాయిలో పెట్టగలిగి వుండగా, పైకి వస్తున్న తన శైశవ ఉత్పత్తులను చాలా కాలం కిందట స్థిరపడిన యింగ్లండు ఉత్పత్తులతో దీర్ఘమైన, సాగదీయబడిన పోటీ అనే యుద్ధానికి లోబరుస్తుందని అనుకోవాల్నా? కానీ, తన రక్షణ వ్యవస్థతో అమెరికా తననే నష్టపరుచుకుంటున్నది, అని మాంచెస్టర్ శాఖ అంటున్నది. పాత పార్లమెంటరీ రైలు యెక్కకుండా — గంటకు పన్రెండు మైళ్లకు బదులు యాభై మైళ్ళు పోవడానికి — ఎక్స్‌ప్రెస్ రైలుకు అదనంగా డబ్బు చెల్లించేవాడు అలాగే తననే నష్టపరుచుకుంటున్నాడు.

పొరపాటేమీ లేదు — నేటి తరం యివన్నీ చూస్తుంది: అమెరికా జవులీ సరుకులు భారతదేశంలోనూ, చైనాలోనూ యింగ్లీషువాటితో పోటీ చేసి, ఆ రెండు ప్రముఖ మార్కెట్లలోనూ క్రమక్రమంగా పోటీలో బలపడతాయి; అమెరికన్ యంత్రాలూ, యినుము సామగ్రీ, యింగ్లండులో సహా ప్రపంచంలోని అన్ని భాగాలలోనూ, యింగ్లీషువాటితో పోటీ చేస్తాయి; ఫ్లేమిష్ ఉత్పత్తులను హాలండుకూ, హాలండు ఉత్పత్తులను యింగ్లండుకూ తరలించిన దుర్వారమైన అవశ్యకతే అచిర కాలంలో ప్రపంచ పరిశ్రమల కేంద్రాన్ని యీ దేశంనుండి

అమెరికా సంయుక్త రాష్ట్రాలకు తరలిస్తుంది. యిక అప్పుడు యింగ్లండుకు మిగిలిన పరిమిత రంగంలో కొన్ని యూరపియన్ జాతులు దానికి బలమైన పోటీదార్లుగా వుంటాయి.

యింగ్లండుయొక్క పారిశ్రామిక గుత్తాధిపత్యం వేగంగా తగ్గిపోతున్నదనే వాస్తవంనుండి యిక యెంతమాత్రమూ తప్పుకోలేము. యీ వాస్తవాన్ని మూసిపెట్టడం తమ ప్రయోజనమని "విజ్ఞాన ప్రబుద్ధ" మధ్యతరగతి అనుకుంటే, కార్మికవర్గం దీనిని పరిశీలించుగాక; యెందు కంటే, యిది వీళ్లకు వీళ్ల "అధికుల" కంటె యెక్కువ ఆసక్తికరం. యీ "అధికులు" యింకా చాలా కాలంవరకు ప్రపంచపు బాంకర్లుగానూ, రుణదాతలుగానూ నిలిచివుండవచ్చు, వీళ్లకంటె ముందు వెనీషియన్లూ, డచ్చివాళ్లూ తమ క్షీణ దశలో నిలిచివుండినట్లు. కానీ, యింగ్లండుయొక్క అపారమైన యెగుమతి వర్తకం విస్తరించడానికి బదులు ప్రతి సంవత్సరమూ కుదించుకొనిపోవడం ప్రారంభించినప్పుడు, "చేతుల" గతి యేమౌతుంది? యినప ఓడల నిర్మాణ వృత్తిని థేమ్స్‌నుండి క్లైడ్‌కు తరలించడం లండన్‌లోని మొత్తం ఈస్టెండును దీర్ఘ దారిద్ర్యంలోకి తోయడానికి చాలితే, యింగ్లండుయొక్క ముఖ్య వృత్తులన్నిటినీ అట్లాంటిక్ అవతలికి దాదాపు తరలించడం యింగ్లండుకు యేమి చేస్తుంది?

అది ఒక గొప్ప పని చేస్తుంది: యింగ్లీషు కార్మికవర్గాన్ని యింగ్లీషు బూర్జువావర్గానికి యింకా బంధిస్తున్న చివరి లంకెను అది భగ్నంచేస్తుంది. జాతీయ గుత్తాధిపత్యాన్ని సమష్టిగా అమలుపరచడం యీ లంకెగా వుండింది. ఆ గుత్తాధిపత్యం ధ్వంసమైనప్పుడు, బ్రిటిష్ కార్మికవర్గం తన సొంత ప్రయోజనాలనూ, తన సొంత మోక్షాన్నీ తన అదుపులోకి తీసుకో డానికీ, వేతనాల వ్యవస్థను తుదముట్టించడానికీ నిర్బంధింపబడుతుంది. ఆ పని చేయడానికి అది అందాకా ఆగదని ఆశిద్దాం.

*The Labour Standard* (London),
నం. 7, జూన్ 18, 1881

■

# రెండు ఆదర్శ పట్టణ కౌన్సిల్లు

■

విదేశాలలోనూ, స్వదేశంలోనూ వున్న కార్మికోద్యమాల గురించి తెలియజేస్తామని మా పాఠకులకు వాగ్దానం చేసినాము. అమెరికాకు సంబంధించిన కొన్ని వార్తలు మేము అప్పుడప్పుడు వాళ్లకు యివ్వగలిగినాము. యిప్పుడు ఫ్రాన్సుకు సంబంధించిన కొన్ని వాస్తవాలు తెలియజేసే స్థితిలో వున్నాము — మా సంపాదకీయ కాలంలలో చర్చించడానికి బాగా తగినంత ప్రాముఖ్యం గల వాస్తవాలు.

యీ దేశంలో యింకా వాడుకలో వున్నట్టి అనేక పబ్లిక్ వోటింగు వ్యవస్థలు ఫ్రాన్సులో లేవు. పార్లమెంటు యెన్నికలకు ఒక విధమైన వోటు హక్కూ, వోటింగు పద్ధతీ, మునిసిపల్ యెన్నికలకు మరొకటీ, వెస్ట్రీ యెన్నికలకు యింకొకటీ, యిలా వుండే బదులు, సాదా అయిన సార్వత్రిక వోటు హక్కూ, బాలట్ద్వారా వోటుచేయడమూ ప్రతిచోటా నియమంగా వున్నాయి. ఫ్రాన్సులో సోషలిస్టు కార్మిక పార్టీ యేర్పాటుచేయబడినప్పుడు, కార్మికుల అభ్యర్థులను పార్లమెంటుకే కాక, సకల మునిసిపల్ యెన్నికలకు కూడా నిలబెట్టాలని తీర్మానించబడింది. ఫ్రాన్సులో పట్టణ కౌన్సిల్లకు జరిగిన గత యెన్నికలలో, గత జనవరి 9న జరిగిన యెన్నికలలో, నిజంగా ఆ యువ పార్టీ పెద్ద సంఖ్య గల పారిశ్రామిక పట్టణాలలోనూ, గ్రామీణ, ముఖ్యంగా గని, కమ్యూన్లలోనూ విజయం పొందింది. వాళ్లు విడివిడిగా అభ్యర్థులను గెలిపించుకోవడమే కాక, కొన్ని చోట్ల కౌన్సిల్లో మెజారిటీ సంపాయించగలిగినారు; కనీసం ఒక కౌన్సిల్లో కార్మికులు తప్ప యెవరూ లేరు — యీ విషయం ముందు తెలుస్తుంది.

*Labour Standard* స్థాపించడానికి కొద్ది ముందు, బెల్జియన్ సరిహద్దుకు దగ్గరలో వున్న రూబా పట్టణంలో ఫాక్టరీ కార్మికుల సమ్మె జరిగింది. ప్రభుత్వం వెంటనే పట్టణాన్ని ఆక్రమించుకోడానికి సైన్యాలను పంపి, తద్వారా, శాంతిని (యే ప్రమాదమూ కలగనిదానిని) రక్షించే సాకుతో, సైన్యాల జోక్యానికి సాకుగా ఉపయోగపడగల చర్యలు చేసేటట్లు సమ్మె చేసేవాళ్లను రెచ్చగొట్టడానికి ప్రయత్నించింది. కానీ వాళ్లు శాంతంగా వుండినారు. రెచ్చగొట్టే చర్యల నన్నిటినీ వాళ్లు ప్రతిఘటించేటట్లు చేసిన ప్రధాన కారణాలలో ఒకటి పట్టణ కౌన్సిల్ చర్య. దానిలోని మెజారిటీ కార్మికులు. సమ్మె విషయం కౌన్సిల్ ముందుకు తేబడి,

విస్తృతంగా చర్చింపబడింది. ఫలితం యేమిటంటే, కౌన్సిల్ సమ్మెచేసేవాళ్లది న్యాయమని ప్రకటించడమే కాక, వాస్తవంగా సమ్మెదార్ల సహాయార్థం 50,000 ఫ్రాంకులు, అనగా 2,000 పౌండ్లు, కేటాయించడానికి వోటుచేసింది. ఆ సహాయక ధనం చెల్లించడానికి వీలులేకపోయింది; యెందుకంటే, ఫ్రెంచి చట్టం ప్రకారం, పట్టణ కౌన్సిళ్ల తీర్మానాలలో దేన్నైనా, వాటి అధికారానికి మించినదని తాను పరిగణించేదాన్ని, రద్దుచేసే అధికారం జిల్లా అధికారికి వుంది. అయినప్పటికీ పట్టణ అధికారిక ప్రతినిధులు ఆవిధంగా సమ్మెకు యిచ్చిన బలమైన నైతిక అండ కార్మికులకు అత్యంత విలువైనదిగా వుండింది.

ఫ్రాన్సు కేంద్రంలో (అలియర్ జిల్లా), కమ్మెంట్రీ మైనింగ్ కంపెనీ జూన్ 8న, కొత్తవీ, మరింత ప్రతికూలమైనవీ అయిన షరతులకు లోబడడానికి నిరాకరించిన 152 మంది కార్మికులకు బర్తరఫ్‌చేసింది. మరింత కష్టమైన పని షరతులు క్రమక్రమంగా ప్రవేశ పెట్టడానికి కొంత కాలంగా అవలంబించబడుతున్న పద్ధతిలో యిది ఒక భాగం గనుక, సుమారు 1600 మంది సమ్మెచేసినారు. సమ్మెదార్లను భయపెట్టడానికీ, రెచ్చగొట్టడానికీ ప్రభుత్వం వెంటనే మామూలుగా పంపే సైన్యాలను పంపింది. కానీ, యిక్కడ కూడా పట్టణ కౌన్సిల్ వెంటనే కార్మికులకు అనుకూలంగా వాళ్ల సమస్యను చేపట్టింది. జూన్ 12న (అందులోనూ ఆదివారం) జరిగిన కౌన్సిల్ సమావేశంలో యీ కింది విధంగా తీర్మానాలు చేయబడినాయి:

1. యెవరు తమ పనిద్వారా అందరి జీవితానికీ వీలు కలిగిస్తున్నారో వాళ్ల జీవితాన్ని నిస్సందేహం చేయడం సమాజంయొక్క ధర్మం గనుకనూ, యీ ధర్మాన్ని నిర్వర్తించడానికి రాజ్యం నిరాకరిస్తే, కమ్యూన్లు నిర్వర్తించక తప్పదు గనుకనూ, అందరికంటె యెక్కువ పన్నులు చెల్లించే పౌరుల అనుమతితో 25,000 ఫ్రాంకుల (1000 పౌండ్లు) రుణం తీసుకోవాలనీ, తమలోని 152 మందిని అసమర్థనీయంగా బర్తరఫ్ చేసినందున విధిలేక సమ్మె చేయవలసివచ్చిన కార్మికుల ప్రయోజనానికి యీ మొత్తాన్ని వినియోగించాలనీ యీ కౌన్సిల్ తీర్మానిస్తున్నది.

మేయర్ ఒక్కడూ చేసిన వీటోకు వ్యతిరేకంగా, తీర్మానం యేకగ్రీవంగా ఆమోదింప బడింది.

2. జాతీయ ఆస్తి అయిన కమ్మెంట్రీ గనులను ఒక జాయింట్ స్టాక్ కంపెనీకి అమ్మడంద్వారా రాజ్యం అక్కడ పనిచేసే కార్మికులను పై కంపెనీయొక్క చంచల దయా ధర్మాలకు అప్పగించింది గనుకనూ; తత్పర్యవసానంగా, ఆ కంపెనీ కార్మికులమీద

సాగించే పీడన వాళ్ల జీవితాన్నే ప్రమాదంలో పెట్టే స్థాయికి పోకుండా రాజ్యం తప్పక చూడవలసివుంది గనుకనూ; కానీ రాజ్యం ప్రస్తుత సమ్మెకాలంలో సైన్యాలను ఆ కంపెనీ అధీనంలో పెట్టడంద్వారా, తన తటస్థతను నిలుపుకోలేదు సరికదా, ఆ కంపెనీ పక్షం వహించింది గనుకనూ;

యీ కౌన్సిల్, యే కార్మికవర్గ ప్రయోజనాలను రక్షించడం తన ధర్మమో ఆ కార్మికవర్గ ప్రయోజనాల పేరుమీద, జిల్లా ఉపఅధికారిని యీ విధంగా కోరుతున్నది —

(1). యెవరి ఉనికి పూర్తిగా అనవసరమో, కేవలం రెచ్చగొట్టడమో, ఆ సైన్యాలను వెంటనే వాపస్ పంపాలనీ,

(2). కంపెనీ మేనేజర్‌కు అడ్డుపడి, సమ్మెకు కారణమైన ఆ చర్యను రద్దు చేసేటట్లు అతన్ని ఒప్పించాలనీ.

ఏకగ్రీవంగా ఆమోదింపబడింది.

ఏకగ్రీవంగానే ఆమోదింపబడిన మూడవ తీర్మానంలో కౌన్సిల్, పైన ఆమోదింపబడిన రుణాన్ని కమ్యూన్‌యొక్క బీదరికం భగ్నపరుస్తుందనే భయంతో, సమ్మెదార్ల సహాయార్థం పబ్లిక్ చందాలు ప్రారంభించి, అదే లక్ష్యం కొరకు సహాయకధనం పంపవలసిందిగా ఫ్రాన్సులోని మునిసిపల్ కౌన్సిల్లు కన్నిటికీ విజ్ఞప్తి చేస్తున్నది.

యీ విధంగా, పార్లమెంటులోనే కాక, మునిసిపల్, తదితర సకల సంస్థలలోనూ కార్మికుల ఉనికిని కన్నులకు కట్టినట్టే నిదర్శనం యిక్కడ వుంది. కార్మికులకు తమను బలపరిచే స్థానిక పట్టణ కౌన్సిల్ వుంటే, యింగ్లండులో అనేక సమ్మెలు యెంత భిన్నంగా అంత మయ్యేవి! యింగ్లీషు పట్టణ కౌన్సిల్లూ, లోకల్ బోర్డులూ, చాలామేరకు కార్మికులచేత యెన్నుకోబడినవి, ప్రస్తుతం దాదాపు పూర్తిగా యజమానులనూ, వాళ్ల ప్రత్యక్ష, పరోక్ష యేజంట్లనూ (లాయర్లూ, వగైరా), మహా అయితే దుకాణదార్లనూ కలిగివున్నాయి.

ఒక సమ్మె గానీ, లాకౌట్ గానీ సంభవించిన వెంటనే, స్థానిక అధికార సంస్థల నైతిక, భౌతిక అధికార మంతా యజమానులకు అనుకూలంగానూ, కార్మికులకు ప్రతికూలంగానూ వినియోగింపబడుతుంది. కార్మికుల డబ్బునుండి జీతాలు చెల్లింపబడే పోలీసులు కూడా, అచ్చం ఫ్రాన్సులో సైన్యాల లాగే, కార్మికులను చట్ట వ్యతిరేక చర్యలు చేసేటట్లు రెచ్చ గొట్టడానికీ, వాళ్లను వేటాడడానికీ వినియోగింపబడతారు. అత్యధిక సందర్భాలలో బీదల చట్టాలను నిర్వహించే అధికార్లు కార్మికులకు ఉపశమనం యివ్వడానికి నిరాకరిస్తారు; వాళ్ల అభిప్రాయంలో, కార్మికులు కావాలంటే పనిచేయవచ్చు. అది సహజమే మరి. యెవరు స్థానిక

అధికార్ల కావడాన్ని శ్రామికజనం భరిస్తున్నారో అట్టి యీ వర్గం మనుషుల దృష్టిలో, సమ్మె అనేది సాంఘిక వ్యవస్థమీద బహిరంగ తిరుగుబాటు, పవిత్ర ఆస్తి హక్కులకు అపచారం. కనుక, యెన్నుకోబడే స్థానిక సంస్థలకు యజమానులనూ, యజమానుల ప్రతినిధులనూ యెన్నుకోడానికి కార్మికవర్గం అంగీకరించినంత కాలం, ప్రతి సమ్మెలోనూ, లాకౌట్‌లోనూ, స్థానిక అధికారుల అపారమైన నైతిక, భౌతిక తూకం అంతా త్రాసులో యజమానులవైపు వుంచబడుతుంది.

ఫ్రెంచి పట్టణ కౌన్సిళ్ల చర్య చాలామంది కన్నులు తెరిపిస్తుందని ఆశిస్తున్నాము. "యీ పనులు ఫ్రెంచివాళ్లు బాగా నిర్వహిస్తారు," అనే మాట శాశ్వతంగా అంటూవుండ వలసిందేనా, యింగ్లీషు కార్మికులకు తగిలేటట్లుగా కూడానూ? యింగ్లీషు కార్మికవర్గం, తన పాత, శక్తివంతమైన సంస్థా నిర్మాణంతో, తన అనాది రాజకీయ స్వాతంత్ర్యాలతో, రాజకీయ ఆచరణలో తనకు గల దీర్ఘ అనుభవంతో, యూరపియన్ భూఖండంలోని యే దేశపు కార్మికవర్గానికీ లేని అపారమైన సౌకర్యాలు కలిగివుంది. కానీ, జర్మన్లు పార్లమెంటుకు పన్రెండు మంది కార్మికవర్గ ప్రతినిధులను పంపగలిగినారు; జర్మన్లూ, ఫ్రెంచివాళ్లూ కొన్ని పట్టణ కౌన్సిళ్లలో మెజారిటీ కలిగివున్నారు. నిజమే, యింగ్లండులో వోటు హక్కు పరిమితంగా వుంది. కానీ, యిప్పుడు కూడా, అన్ని పెద్ద పట్టణాలలోనూ, పారిశ్రామిక జిల్లాలలోనూ కార్మికవర్గానికి మెజారిటీ వుంది. వాళ్లు సంకల్పిస్తే చాలు, ఆ గుప్త మెజారిటీ క్రియాత్మక మెజారిటీ ఔతుంది, రాజ్యంలో ఒక శక్తి ఔతుంది, శ్రామిక జనం సాంద్రీకరింప బడిన ప్రాంతాలన్నిటిలోనూ ఒక శక్తి ఔతుంది. పార్లమెంటూ, పట్టణ కౌన్సిళ్లూ, గార్డియన్ల స్థానిక సంస్థలూ, వగైరాలలో ఒకసారి కార్మికులు వుంటే, యిప్పుడు అంత తరుచుగా ప్రజల మీద జులుం సాగించే ఆ దురహంకారపు అధికార్లకు అడ్డుపుల్లలు వేయగలిగే కార్మిక మేజిస్ట్రేట్లు కూడా వుండడం యెంత దూరంలో వుంటుంది?

*The Labour Standard* (London),
నం. 8, జూన్ 25, 1881

## అమెరికన్ ఆహారమూ, భూమి సమస్యా

డబ్బు భయస్థితులూ, వాణిజ్య సంక్షోభాలూ న్యూయార్కునుండి యింగ్లండుకు దిగుమతి కావడం మనకు 1837 శరదృతువునుండి అలవాటైంది. దశవర్ష పారిశ్రామిక తిరోగమనాలలో కనీసం రెండింట ఒకటి అమెరికాలో ప్రారంభమైంది. కానీ, అమెరికా సంప్రదాయ సన్నుతమైన బ్రిటిష్ వ్యవసాయ సంబంధాలను కూడా తలక్రిందులు చేయడమూ, భూస్వామికీ, కౌలుదారునికీ మధ్య అనాదిగా వున్న ఫ్యూడల్ సంబంధాలను యిష్టం వచ్చినట్లు విప్లవీకరించడమూ, యింగ్లీషు కౌళ్లను బ్రద్దలుచేయడమూ, యింగ్లీషు క్షేత్రాలను మైదారులుగా మార్చడమూ — యిదంతా పందొమ్మిదవ శతాబ్ది చివరి పాదానికి రిజర్వుచేయబడిన దృశ్యం.

మరి అది అలాంటిదే. పశ్చిమ ప్రేరీలోని బీడుభూమి — యిప్పుడు సాగులోకి వస్తున్నది, ముక్కలు ముక్కలుగా కాదు, వేల చదరపు మైళ్లలో — యిప్పుడు గోధుమ ధరను పాలిస్తున్నది, తత్పర్యవసానంగా గోధుమ పొలాల కౌలును పాలిస్తున్నది. పాత నేల యేదీ దానితో పోటీచేయలేదు. అది అద్భుతమైన భూమి, చదునైనది, లేదా కొద్దిగా హెచ్చుతగ్గులున్నది, తీవ్ర ఉత్పతనాలతో కలచివేయబడనిది, టెర్షరీ మహాసముద్రం అడుగున మెల్లగా యే స్థితిలో పేర్చబడిందో సరిగ్గా అదే స్థితిలో వున్నది; రాళ్ళూ, బండలూ, చెట్లూ లేనిది; యే సన్నాహక శ్రమా లేకుండా వెంటనే సాగుచేయడానికి యోగ్యమైనది. చెట్లు కొట్టివేయడమూ, మురుగునీరు తొలగించడమూ అక్కరలేదు; నాగలి ఒకసారి అటూ యిటూ తిప్పితే చాలు, విత్తనం వేయడానికి సిద్ధంగా వుంటుంది, యెరువు లేకుండా వరసగా యిరవై ముప్పై గోధుమ పంటలు పండుతుంది. అది అమోఘమైన ప్రమాణంలో వ్యవసాయం చేయడానికి యోగ్యమైన నేల, అమోఘమైన ప్రమాణంలోనే దాన్ని సాగుచేస్తున్నారు. యూరపియన్ భూఖండంలోని రైతు యజమానుల చిన్న క్షేత్రాలతో పోల్చి, బ్రిటిష్ వ్యవసాయదారుడు తన పెద్ద క్షేత్రాలను చూసి గర్వించేవాడు; కానీ అమెరికన్ ప్రేరీలోని క్షేత్రాలతో పోలిస్తే యింగ్లండులోని అత్యంత పెద్ద క్షేత్రాలు కూడా యెంత? ఆ అమెరికన్ క్షేత్రాలు 40,000 యెకరాలూ, యింకా యెక్కువ వున్నాయి; అచ్చం సైన్యాలలాంటి మానవ

బృందాలచేతా, పనిముట్లచేతా, సైనికులలాగే శిక్షణా, ఉత్తరువులూ, నిర్మాణమూ గలవాటిచేత, అవి సాగుచేయబడుతున్నాయి.

వ్యవసాయంలో యీ అమెరికన్ విప్లవం, అమెరికన్లు సృష్టించినట్టి విప్లవీకృత రవాణా సాధనాలతో కలిసి, యూరప్‌కు గోధుమలు యెంత తక్కువ ధరలకు పంపుతున్నదంటే, ఆ గోధుమలతో యే యూరపియన్ రైతూ పోటీచేయలేడు — కనీసం అతను కౌలు చెల్లిస్తాడని అనుకుంటే. యిది మొదట అనుభూతమైన 1879 సంవత్సరాన్ని చూడండి. పశ్చిమ యూరప్‌లో పంట హీనంగా వుండింది, యింగ్లండులో విఫలమైంది. కానీ అమెరికన్ ధాన్యం ధర్మమా అని, ధరలు దాదాపు నిలకడగా వుండినాయి. మొట్టమొదటి సారిగా బ్రిటిష్ వ్యవసాయదారునికి ఒకే సమయంలో హీనమైన గోధుమ పంటా, తక్కువ గోధుమ ధరలూ వుండినాయి. అప్పుడు వ్యవసాయదార్లు కదల నారంభించినారు, భూస్వాములకు భయం తగిలింది. మరు సంవత్సరం, అంతకంటె మంచి పంటతో, ధరలు యింకా తగ్గినాయి. ధాన్యం ధర యిప్పుడు అమెరికాలో ఉత్పత్తి ఖర్చుచేతా, రవాణా ఖర్చుచేతా నిర్ణయింపబడుతున్నది. మరి యేటికేటికీ యెక్కువగా యిలా జరుగుతుంది, కొత్త ప్రేరీ భూమి యెంత సాగులోకి వస్తే అంతగా. ఆ పనికి అవసరమైన వ్యవసాయ సైన్యాలు — వాటిని మనమే యూరప్‌లో చూసిపెడుతున్నాము, వలసపోయేవాళ్లను పంపించడంద్వారా.

గతంలో వ్యవసాయదారునికీ, భూస్వామికీ ఒక ఊరట వుండేది — ధాన్యం గిట్టుబాటు కాకపోతే, మాంసం ఔతుందని. సాగుభూమి పచ్చికభూమిగా మార్చబడేది, అంతా మళ్లీ హాయిగా వుండేది. కానీ ఆ వనరు కూడా యిప్పుడు కత్తరించివేయబడింది. అమెరికన్ మాంసమూ, అమెరికన్ పశువులూ నిత్యం పెరుగుతున్న పరిమాణాలలో యెగుమతి ఔతున్నాయి. అంతే కాదు. పెద్ద పశు ఉత్పాదక దేశాలు, తమ అపారమైన అదనపు మాంసాన్ని, యిప్పుడు వ్యర్థమైపోతున్నదాన్ని, యూరప్‌కూ, ముఖ్యంగా యింగ్లండుకూ యెగుమతిచేయడానికి వీలు కలిగించే పద్ధతుల కోసం పోరజాస్తున్న దేశాలు, కనీసం రెండు వున్నాయి. ప్రస్తుత శాస్త్ర విజ్ఞాన స్థితితో, శాస్త్రవిజ్ఞానాన్ని ప్రయుక్తంచేయడంలో జరిగిన సత్వర పురోగతితో, యెంత ఆలస్యం జరిగినా అతి కొద్ది సంవత్సరాలలో, ఆస్ట్రేలియా, దక్షిణ అమెరికాల మాంసమూ, గోమాంసమూ ఉత్కృష్టంగా నిలువజేయబడిన స్థితిలో, అపారమైన పరిమాణాలలో దిగుమతి ఔతాయి. అప్పుడు బ్రిటిష్ వ్యవసాయదారుని సౌభాగ్యమూ, బ్రిటిష్ భూస్వామియొక్క పెద్ద కౌలు పట్టీ యేమౌతాయి? గూస్‌బెర్రీలూ, స్ట్రాబెర్రీలూ, మొదలైనవి పండించడం చాలా మంచిదే — వాటి మార్కెట్‌కు యిప్పుడు సరుకు బాగానే సరఫరా అవుతున్నది. నిజమే, బ్రిటిష్ కార్మికుడు యీ పసందైన పండ్లను యిప్పటికంటె యెక్కువ తినగలడు — కానీ, మొదట అతని వేతనాలు యెక్కించండి.

యీ కొత్త అమెరికన్ వ్యవసాయ పోటీయొక్క ఫలితం యూరపియన్ భూఖండంమీద కూడా అనుభూతవౌతున్నదని చెప్పడం అనవసరం. చిన్న రైతు యజమాని — అత్యధిక సందర్భాలలో తలమునుకలుగా తనఖాలో వున్నవాడు — యింగ్లీషు, ఐరిష్ వ్యవసాయదారుడు చెల్లించే కౌలుకు బదులు వడ్డీ, కోర్టు ఖర్చులూ చెల్లించేవాడు, యీ పోటీ ఫలితాన్ని అంతగానూ అనుభవిస్తున్నాడు. యీ అమెరికన్ పోటీయొక్క ఒక విలక్షణమైన ఫలితం యేమిటంటే, అది పెద్ద భూమి ఆస్తినే కాక, చిన్న భూమి ఆస్తిని కూడా నిరుపయోగం చేస్తున్నది, రెంటినీ లాభదాయకం కాకుండా చేయడంద్వారా.

భూమిని నీరసపరిచే యీ పద్ధతి, యిప్పుడు దూర పశ్చిమంలో ఆచరణలో వున్నట్టిది, యెల్లకాలమూ సాగజాలదనీ, పరిస్థితులు మళ్లీ బాగుపడక తప్పదనీ అనవచ్చు. నిజమే, అది యెల్లకాలమూ సాగజాలదు; కానీ, మరొక శతాబ్దం పాటు యీ ప్రక్రియను సాగించడానికి యింకా నీరసపరచబడని భూమి దండిగా వుంది. పైగా, యిలాంటి సౌకర్యాలు ప్రసాదించే యితర దేశాలు కూడా వున్నాయి. దక్షిణ రష్యన్ మైదానం యావత్తూ వుంది; అక్కడ నిజంగానే వ్యాపారస్తులు భూమిని కొని, అదే పని చేసినారు. అర్జంటైనా రిపబ్లిక్‌లో విస్తారమైన పంపాస్ వున్నాయి, యింకా యితరవి వున్నాయి. యీ భూము లన్నీ బ్రహ్మాండమైన వ్యవసాయమూ, చౌక ఉత్పత్తీ అనే యీ ఆధునిక పద్ధతికి సమానంగా తగినవే. ఫలితంగా, యీ పని ముగిసేలోపల యిది యూరప్‌లోని చిన్న పెద్ద భూస్వాముల నందరినీ చంపడానికి తగినంత దీర్ఘ కాలం బతికివుంటుంది — కనీసం రెండు సార్లు చంపడానికి.

సరే — యీ అంతటియొక్క ఫలితం యేమిటి? ఫలితం, వుండబోయేదీ, వుండక తప్పనిదీ, యేమిటంటే, భూమి జాతీయకరణమూ, జాతీయ అజమాయిషీకింద సహకార సంఘాలద్వారా దాని వ్యవసాయాన్నీ అది మనమీద నిర్బంధంగా మోపుతుంది. అప్పుడు, అప్పుడు మాత్రమే, భూమిని సాగుచేయడం సాగుదార్లకూ, జాతికీ గిట్టుబాటు అవుతుంది, అమెరికావైనా, మరేవైనా ధాన్యం, మాంసాల ధర యెలా వున్నప్పటికీ. మరి యీలోపల భూస్వాములు — తాము అమెరికాకు పోవాలని సగం యిష్టం వున్నట్లు కనపడుతున్న విధంగా — వాస్తవంగా అమెరికాకు పోతే, వాళ్లకు సుఖ ప్రయాణం కలుగుగాక అని కోరుతాం.

*The Labour Standard* (London),
నం. 9, జూలై 2, 1881

32

# ధాన్యం చట్టాల వ్యతిరేక లీగు యొక్క వేతన సిద్ధాంతం

జూన్ 18 నాటి *The Labour Standard*లోని ఒక సంపాదకీయ వ్యాసంలోని* మా అభిప్రాయ ప్రకటనలలో కొన్నిటిని తప్పు పట్టుతూ జె. నోబుల్ రాసిన లేఖను మరొక కాలంలో ప్రచురిస్తున్నాము. మన సంపాదకీయ కాలంలను, సహజంగానే, చారిత్రక వాస్తవాలమీదా, ఆర్థిక సిద్ధాంతాలమీదా వాదోపవాదాలకు వాహికగా చేయలేకపోయినప్పటికీ, ఒక్కసారి, అధికారిక పార్టీ పదవిలో వున్నప్పటికీ స్పష్టంగా చిత్తశుద్ధి కలిగినట్టి ఒక మనిషికి సమాధానం యిస్తాము.

ధాన్యం చట్టాల రద్దుద్వారా లక్షింపబడింది "బ్రెడ్డు ధరను తగ్గించడమూ, తద్వారా డబ్బు రూపంలో యిచ్చే కూలి రేటును తగ్గించడమూ" అన్న మా ఉద్ఘాటనకు జవాబుగా నోబుల్ యిది లీగుచేత పదేపదే యెదిరించబడిన "రక్షణవాద పొరపాటు" అని అంటూ, రిచర్డ్ కాబ్డెన్ ఉపన్యాసాలనుండీ, లీగుయొక్క కౌన్సిల్ ఉపన్యాసంనుండీ కొన్ని ఉల్లేఖనలు యిచ్చినాడు.

ఆ వ్యాసం రాసిన రచయిత ఆ కాలంలో మాంచెస్టర్‌లో వుంటూవుండినాడు — ఉత్పత్తిదారులలో ఒకడుగా. నిజమే, లీగుయొక్క అధికారిక సిద్ధాంతం యెలా వుండిందీ అతనికి బాగా తెలుసు. దానిని అత్యంత సంక్షిప్తమూ, అత్యంత సాధారణంగా గుర్తింపబడినదీ అయిన రూపానికి (అనేక రకాలు వున్నాయి గనుక) కుదిస్తే, యిలా వుంటుంది: ధాన్యంమీద సుంకాన్ని రద్దుచేయడం విదేశాలతో మన వర్తకాన్ని పెంచుతుంది, నేరుగా మన దిగుమతులను పెంచుతుంది; వాటికి బదులుగా విదేశ కొనుగోలుదార్లు మన ఉత్పత్తులను కొంటారు; తద్వారా మన పారిశ్రామిక సరుకులకు డిమాండు పెరుగుతుంది; ఆ విధంగా మన పారిశ్రామిక కార్మిక జనాభాయొక్క శ్రమకు డిమాండు పెరుగుతుంది, కనుక వేతనాలు తప్పక పెరుగుతాయి. రోజు తర్వాత రోజు, సంవత్సరం తర్వాత సంవత్సరం యీ సిద్ధాంతాన్ని పునశ్చరణ చేయడంద్వారా లీగుయొక్క అధికారిక ప్రతినిధులు, లోతులేని అర్థశాస్త్రజ్ఞులు గనుక, చివరకు

---

*యీ పుస్తకం 21 – 25 పుటలు చూడండి. – సం.

యీ నిర్ధాంతపరిచే ఉద్ఘాటనతో ముందుకు వచ్చినారు — వేతనాలు లాభాలనుబట్టి కాక, ఆహార ధరనుబట్టి విలోమ నిష్పత్తిలో పడిపోతాయి; ప్రియమైన బ్రెడ్డు అంటే తక్కువ వేతనాలు, చౌక బ్రెడ్డు అంటే యెక్కువ వేతనాలు, అనే ఉద్ఘాటనతో. ఆ విధంగా లీగు ప్రతినిధులు యిలా ప్రకటించినారు: దశవర్ష వాణిజ్య తిరోగమనాలు, ధాన్యం సుంకాల రద్దుకు ముందూ తర్వాతా వుండినవి, ధాన్యం చట్టాల ప్రత్యక్ష ఫలితాలట; ద్వేష్యమైన ఆ చట్టాలు తొలగింపబడిన వెంటనే అవి అదృశ్యం కాక తప్పదట; బ్రిటిష్ బట్టలు లేనందువల్ల దిగంబరంగా చలికి వణుకుతూ, బ్రిటిష్ ఉత్పత్తిదారుని ఉత్పత్తుల కోసం తపించే దయనీయమైన విదేశీయులకూ ఆ బ్రిటిష్ ఉత్పత్తిదార్లకూ మధ్య వుండే ఏకైక మహా అడ్డంకి ధాన్యం చట్టాలట. ఆవిధంగా, 1839 నుండి 1842 దాకా వుండిన వర్తక మాంద్యమూ, వేతనాలు పడిపోవడమూ సరిగ్గా ఆ సంవత్సరాలలోని యెక్కువ ధాన్యం ధరయొక్క పర్యవసానమని, నోబుల్ ఉల్లేఖించిన ఆ వాక్యాలలో కాబ్డెన్ వాస్తవంగా చెప్పగలిగినాడు. నిజానికది యింతవరకు అత్యంత క్రమత్వంతో ప్రతి పదేండ్లకూ మళ్లీమళ్లీ వచ్చే వర్తక మాంద్యంయొక్క క్రమమైన దశలలో ఒకటి తప్ప మరేమీ కాదు; నిశ్చయంగా యీ దశ హీనమైన పంటలచేతా, దురాశాపూరిత భూస్వామ్యచట్టాల తెలివి తక్కువ జోక్యంచేతా దీర్ఘమూ, తీవ్రమూ చేయబడింది.

ఆందోళనకారుడుగా యెంత యుక్తిపరుడైనప్పటికీ, హీనమైన వ్యాపారస్తుడూ, లోతు లేని అర్థశాస్త్రజ్ఞుడూ అయిన కాబ్డెన్‌యొక్క అధికారిక సిద్ధాంతం యిది. దీన్ని నోబుల్ యీనాటి వరకు యెంత విశ్వాసంతో నమ్మినాడో అంత విశ్వాసంతో కాబ్డెన్ నమ్మినాడనడంలో సందేహం లేదు. కానీ లీగులో అత్యధిక భాగం వ్యవహారజ్ఞులైన వ్యాపారస్తులు — వ్యాపారంపట్ల యెక్కువ శ్రద్ధ కలిగి, అందులో మొత్తంమీద కాబ్డెన్‌కంటె యెక్కువ విజయం పొందినవాళ్లు. మరి వీళ్ల విషయం పూర్తిగా వేరు. నిజమే, కొత్తవాళ్ల ముందరా, బహిరంగ సభల్లోనూ, ముఖ్యంగా తమ "చేతుల" ముందరా, సాధారణంగా అధికారిక సిద్ధాంతం "సరైనది"గా పరిగణింపబడేది. కానీ వ్యాపారస్తులు, వ్యాపారంమీద శ్రద్ధగలవాళ్లు, సాధారణంగా తమ బేరగాళ్లతో మనసు విప్పి మాట్లాడరు. నోబుల్ అభిప్రాయం యిందుకు భిన్నంగా వుంటే, ఆయన మాంచెస్టర్ ఎక్స్ఛేంజికి దూరంగా వుండడం మంచిది. ధాన్యంలో నిర్నిబంధ వర్తకంయొక్క పర్యవసానంగా యేవిధంగా వేతనాలు తప్పక పెరుగుతాయని కొంచెం నిగ్గదీస్తే చాలు, యీకింది విషయం బయటికి వచ్చేది: యీ పెరుగుదల సరుకులలో వ్యక్తమైన వేతనాలను మారుస్తుందని అనుకోబడుతున్నది; డబ్బురూపంలో యిచ్చే వేతనాల రేటు పెరగకపోవడం పూర్తిగా సంభవం కావచ్చు — కానీ అది వాస్తవంగా వేతనాల పెరుగుదల కాదా? దీన్ని మరికొంత నిగ్గదీస్తే, మామూలుగా యీ కింది విషయం

బయటికి వచ్చేది: డబ్బురూపంలో యిచ్చే వేతనాల రేటు పడిపోవచ్చును కూడా, కానీ, అప్పటికి యీ తగ్గిన డబ్బుకు కార్మికునికి సరఫరాచేయబడే సుఖాలు అప్పుడు అతను అనుభవించే వాటికంటె అధికమైనవిగా వుంటాయి. యిక, ఆశింపబడిన అపారమైన వాణిజ్య విస్తరణ యే విధంగా సాధించబడుతుందని మరికొన్ని నిలదీసే ప్రశ్నలు వేస్తే, డబ్బురూపంలో యిచ్చే వేతనాల తగ్గుదల, బ్రెడ్డు ధర పతనమూ వగైరాలతో కలిసినప్పుడు, యీ తగ్గుదలవలన కలిగే నష్టాన్ని యింకా యెక్కువగానే భర్తీ చేసే అంతిమ పరిస్థితిమీద వాళ్లు ప్రధానంగా ఆధారపడినట్లు అతిత్వరలో తెలుస్తుంది. అంతే గాక, కేవలం డబ్బురూపంలో యిచ్చే వేతనాలను తగ్గించడానికీ, తద్వారా విదేశీ పోటీని హతమార్చడానికీ చౌక బ్రెడ్డు కోరబడు తున్నదనే తమ అభిప్రాయాన్ని మరుగుపరచడానికి కూడా ప్రయత్నించనివాళ్లు చాలామంది కనపడేవాళ్లు. లీగుయొక్క విస్తారమైన సభ్యత్వంగా యేర్పడే ఉత్పత్తిదార్లలోనూ, వ్యాపారస్తులలోనూ అధికభాగంయొక్క గమ్యమూ, లక్ష్యమూ, వాస్తవంలో, యీ విదేశ పోటీని హతమార్చడమే అనే విషయం గ్రహించడం యేమంత కష్టంగా వుండేది కాదు — వ్యాపారస్తులతో వ్యవహరించే అలవాటు కలిగి, తన్మూలంగా వాళ్ల మాటను సర్వదా వేదవాక్యంగా తీసుకోకుండా వుండే అలవాటు కలిగిన యెవరికైనా. యిదే మేమన్నది, యిది మళ్లీ అంటాము కూడా. లీగుయొక్క అధికారిక సిద్ధాంతం గురించి మేము ఒక్క మాట కూడా అనలేదు. అర్థశాస్త్ర రీత్యా అది "పొరపాటు"; ఆచరణలో అది కేవలం స్వార్థ ప్రయోజనాలకు ముసుగు — కొంతమంది నాయకులు దాన్ని చివరకు తామే నమ్మేటంత తరుచుగా పునశ్చరణ చేసివుండినప్పటికీ.

ధాన్యం 25 షిల్లింగులకు 28 పౌనులు దొరికే అవకాశానికి కార్మికులు "సంతృప్తితో చేతులు రుద్దుకోవడం" గురించి కాబ్డెన్ చెప్పిన మాటలు నోబుల్ ఉల్లేఖించడం చాలా వినోదకరంగా వుంది. ఆనాటి కార్మికవర్గం చౌక బ్రెడ్డును నీచంగా చూడలేదు; కానీ వాళ్లకు కాబ్డెన్ అండ్ కంపెనీ చర్యలపట్ల యెంత సంపూర్ణ "సంతృప్తి" వుండిందంటే, మొత్తం ఉత్తర యింగ్లండులో నిజమైన బహిరంగ సభ ఒక్కటైనా జరుపుకోడానికి గత కొన్ని సంవత్సరాలుగా వాళ్లు లీగుకు అసాధ్యం చేసినారు. 1843లో, శాల్ఫర్డ్ టౌన్ హాల్‌లో అలాంటి సభ జరపడానికి లీగు చివరిసారి ప్రయత్నించినప్పుడు, ఆ సభకు హాజరై, కేవలం "ప్రజా హక్కుల పత్రా"నికి అనుకూలంగా ఒక సవరణ పెట్టడంద్వారా ఆ సభ దాదాపు భగ్నం కావడం చూసే "సంతృప్తి" యీ రచయితకు వుండింది. అప్పటినుండి అన్ని లీగు సభలకూ "టికెట్టుద్వారా ప్రవేశం" నియమంగా వుండింది; ప్రతి పోకిరికీ అందుబాటులో లేని ప్రవేశం అది. ఆ క్షణంనుండి "చార్టిస్టులు అడ్డుపడడం" ఆగి

పోయింది. కార్మిక జనాలు తమ లక్ష్యం సాధించినారు — లీగు నటిస్తున్నట్లు తమకు ప్రాతినిధ్యం వహించడంలేదని రుజువు చేయడం.

ముగింపుగా, లీగుయొక్క వేతనాల సిద్ధాంతం గురించి కొద్ది మాటలు. ఒక సరుకు యొక్క సగటు ధర దాని ఉత్పత్తి ఖర్చుకు సమానం. ఆ ధర యే ప్రమాణంచుట్టూ వెనక్కీ ముందుకూ వూగుతూ వుంటుందో ఆ ప్రమాణానికి దాన్ని మళ్లీ తీసుకరావడం సరఫరా, డిమాండులు చేసే పని. అన్ని సరుకులకూ యిది వర్తిస్తే, శ్రమ (కచ్చితంగా చెప్పాలంటే, శ్రమ శక్తి) అనే సరుకుకు కూడా వర్తిస్తుంది. అప్పుడు, శ్రామికుడు అలవాటుగానూ, అవశ్యంగానూ వుపయోగించే సరుకుల ధరచేత కూలి రేటు నిర్ణయింపబడుతుంది. మరొక విధంగా చెప్పాలంటే, యితర పరిస్థితులన్నీ మారకుండా వున్నప్పుడు, వేతనాలు జీవితావసర వస్తువుల ధరతో పాటు పెరుగుతూ, తరుగుతూ వుంటాయి. యిదొక అర్థశాస్త్ర నియమం — దీని యెదుట పెరొనెట్ థాంప్సన్‌లూ, కాబ్డెన్‌లూ, బ్రైట్‌లూ అందరూ యెల్లప్పుడూ నిర్వీర్యులుగా వుంటారు. కానీ, యితర పరిస్థితు లన్నీ యెల్లప్పుడూ మారకుండా వుండవు; కనుక ఆచరణలో యీ నియమంయొక్క చర్య దీనితో పాటు పనిచేసే యితర ఆర్థిక నియమాల చర్యచేత పాక్షికంగా మారుతుంది; యిది మరుగుపడినట్లు కనపడుతుంది, ఒకోసారి యెంతగా అలా కనపడుతుందంటే, దీన్ని కనుక్కోడానికి మనం కష్టపడవలసి వుంటుంది. యీ పరిస్థితిని సాకుగా తీసుకొని, ధాన్యం చట్టాల వ్యతిరేక లీగు కాలంనుండి, వెకిలి పరిచే, వెకిలి అర్థశాస్త్రజ్ఞులు మొదట శ్రమకూ, తరువాత యితర సరుకుల కన్నిటికీ నిజమైన, నిర్ణయింప వీలైన విలువ లేదని, హెచ్చు తగ్గు లయ్యే ధర, ఉత్పత్తి ఖర్చుతో దాదాపు నిమిత్తం లేకుండా సరఫరా డిమాండులచేత సరిదిద్దబడేది, మాత్రమే వుందనీ, ధరలను పెంచడానికి, కనుక వేతనాలను పెంచడానికి, చేయవలసిందల్లా డిమాండును పెంచడమే అనీ నటించినారు. ఆ విధంగా ఆహార ధరతో వేతనాల రేటుకు గల అప్రియమైన సంబంధాన్ని తొలగించుకొని, ప్రియమైన బ్రెడ్డు అంటే తక్కువ వేతనాలనీ, చౌక బ్రెడ్డు అంటే యెక్కువ వేతనాలనీ యీ మొరటు, అవహాస్యకర సూత్రంలో యెవరైనా ధైర్యంగా ఉద్ఘాటించవచ్చు.

1847కు ముందు సుంకంవేయబడిన, ప్రియమైన బ్రెడ్డుతో పాటు వుండిన వేతనాలు యెంత యెక్కువగా వుండినాయో సాధారణంగా అంత యెక్కువగా, లేదా అంతకంటె యెక్కువగా యీనాటి చౌక బ్రెడ్డుతోపాటు వుండే వేతనాలు లేవా, అని బహుశా నోబుల్ అడగవచ్చు. దానికి జవాబుచెప్పడానికి చాలా విషయాలు విచారించాలి. కానీ యింత మాత్రం నిశ్చయం: ఒక పరిశ్రమ బాగుపడి, అదే సమయంలో కార్మికులు ఆత్మరక్షణ కొరకు బలంగా సంఘటిత మైనచోట, వాళ్ల వేతనాలు సాధారణంగా పడిపోలేదు, కొన్నిసార్లు

బహుశా పెరిగినాయి. అంతకుముందు వాళ్లకు తక్కువ వేతనాలు యిచ్చేవాళ్ళు అని మాత్రమే యిది రుజావుచేస్తుంది. ఒక పరిశ్రమ క్షీణించి, కార్మికులు ట్రేడ్ యూనియన్లలో బలంగా సంఘటితం కానిచోట, వాళ్ల వేతనాలు మినహాయింపులు లేకుండా పడిపోయినాయి, తరుచుగా పస్తులుండే స్థాయికి కూడా. లండన్ ఈస్టెండ్‌కు పోయి, మీరే స్వయంగా చూడండి!

*The Labour Standard* (London),
నం. 10, జూలై 9, 1881

■

# కార్మికుల పార్టీ

■

"పార్టీ రాజకీయాలకు దూరంగా వుండండి!" అని యెన్నిసార్లు మిత్రులూ, సాను భూతిపరులూ మనలను హెచ్చరించలేదు! మరి వాళ్లు చెప్పింది పూర్తిగా ఒప్పే, ప్రస్తుత యింగ్లీషు పార్టీ రాజకీయాలకు సంబంధించినంత వరకు. కార్మిక సంఘం విగ్గుగా గానీ, టోరీగా గానీ, కన్సర్వేటివ్‌గా గానీ, లిబరల్‌గా గానీ, చివరకు రాడికల్‌గా గానీ, వాస్తవమైన పార్టీ అనే అర్థంలో, వుండకూడదు. కన్సర్వేటివ్‌లూ, లిబరల్‌లూ, రాడికల్‌లూ, అందరూ పాలకవర్గ ప్రయోజనాలకు మాత్రమే ప్రాతినిధ్యం వహిస్తారు; భూస్వాములలోనూ, పెట్టు బడిదార్లలోనూ, చిల్లర వర్తకులలోనూ పెత్తనం చేస్తున్న వివిధ అభిప్రాయ భేదాలకూ ప్రాతినిధ్యం వహిస్తారు. వాళ్లు కార్మికవర్గానికి ప్రాతినిధ్యం వహిస్తారూ అంటే, అత్యంత నిశ్చితంగా వాళ్లు దానికి తప్పుగా ప్రాతినిధ్యం వహిస్తారు. కార్మికవర్గానికి సొంత ప్రయో జనాలు వున్నాయి, రాజకీయమైనవీ, సాంఘికమైనవీ. తన సాంఘిక ప్రయోజనాలు అని తాను పరిగణించేవాటికోసం అది యెలా నిలబడిందీ ట్రేడ్ యూనియన్ల చరిత్రా, "తక్కువ కాలం" ఉద్యమమూ తెలియజేస్తాయి. కానీ తన రాజకీయ ప్రయోజనాలను అది పైవర్గం వాళ్లైన టోరీల, విగ్గుల, రాడికల్‌ల చేతుల్లో దాదాపు పూర్తిగా వదిలేసింది; దాదాపు పావు శతాబ్దంగా యింగ్లండు కార్మికవర్గం "మహా లిబరల్ పార్టీ"కి తోక అన్నట్లుగా కావడంతో తృప్తిపడింది.

యూరప్‌లోకెల్లా బాగా సంఘటితమైన కార్మికవర్గానికి యిది అయోగ్యమైన స్థితి. యితర దేశాలలో కార్మికులు యింతకంటె చురుకుగా వున్నారు. జర్మనీకి పదేండ్లకు పైగా నుండి యెలాంటి కార్మికుల పార్టీ (సోషల్ డెమోక్రట్లు) వుందంటే, దానికి పార్లమెంటులో పది సీట్లు వున్నాయి, దాని పెరుగుదలకు భయపడి బిస్మార్కు అపఖ్యాతమైన దమన చర్యలకు పూనుకున్నాడు (యీ చర్యల గురించి మరొక కాలంలో చెప్పబడింది).* కానీ, బిస్మార్కు వున్నప్పటికీ, కార్మికుల పార్టీ స్థిరంగా పురోగమిస్తున్నది; గత వారమే అది మాన్‌హీమ్ పట్టణ కౌన్సిల్‌కు పదహారు యెన్నికలూ, శాక్సన్ పార్లమెంటుకు ఒక యెన్నికా గెలిచింది. బెల్జియం, హాలండ్, ఇటలీలు జర్మన్లను అనుకరించినాయి; యీ దేశాలలో ప్రతిదానిలోనూ

---

*యీ పుస్తకంలో 41–43 పేజీలు చూడండి. – సం.

కార్మికుల పార్టీ వుంది, అక్కడ వోటర్ కుండవలసిన యోగ్యత ప్రస్తుతం వాళ్ళు శాసన సభకు సభ్యులను పంపడానికి అవకాశం లేనంత యెక్కువగా వున్నప్పటికీ. ఫ్రాన్సులో కార్మికుల పార్టీ యిప్పుడు పూర్తి నిర్మాణ ప్రక్రియలో వుంది; అది గత యెన్నికలలో కొన్ని మునిసిపల్ కౌన్సిళ్లలో మెజారిటీ సంపాయించింది, వచ్చే అక్టోబర్‌లో ఛేంబర్‌కు జరిగే సాధారణ యెన్నికలలో నిస్సంశయంగా కొన్ని సీట్లు గెలుచుకుంటుంది. కార్మికవర్గం కర్షక వర్గంలోకీ, వర్తక వర్గంలోకీ, పెట్టుబడిదారీ వర్గంలోకీ మారడం సాపేక్షంగా సులభంగా వున్న అమెరికాలో కూడా, కార్మికులు ఒక స్వతంత్ర పార్టీగా సంఘటితం కావడం అవసరమౌతున్నది. ప్రతిచోటా కార్మికుడు రాజకీయ అధికారంకోసం, శాసనసభలో తన వర్గంయొక్క ప్రత్యక్ష ప్రాతినిధ్యం కోసం, పోరాడుతున్నాడు — ప్రతిచోటా, గ్రేట్ బ్రిటన్‌లో తప్ప.

అయినప్పటికీ, పాత పార్టీలకు ఆయువు మూడిందనీ, పాత మంత్రాలు అర్థం కోల్పోయినాయనీ, పాత సూత్రాలు బద్దలైపోయినాయనీ, పాత సర్వరోగనివారిణులు యిక యెంత మాత్రమూ పనిచేయవనీ యిప్పు డున్నంత విస్తృత భావం యింగ్లండులో యెప్పుడూ లేదు. కొత్త దారి తొక్కాలనీ, అది ప్రజాస్వామ్య దిశలో మాత్రమే వుండగలదనీ అన్ని వర్గాల ఆలోచనాశీలురూ తెలుసుకోవడం ఆరంభమైంది. కానీ యింగ్లండులో, పారిశ్రామిక, వ్యావసాయిక కార్మికవర్గం ప్రజలలో అపారమైన మెజారిటీగా వున్నచోట, ప్రజాస్వామ్యం అంటే కార్మికవర్గ ప్రభుత్వం అన్నమాట — కచ్చితంగా అంతే. కనుక, కార్మికవర్గం తనకు రానున్న కర్తవ్యానికి సిద్ధం కానీ — యీ మహా సామ్రాజ్య పరిపాలనకు; అనివార్యంగా తమ వంతుకు వచ్చే బాధ్యతలను వాళ్ళు అర్థంచేసుకోనీ. దీనికి అత్యుత్తమ మార్గం యేమిటంటే, పార్లమెంటుకు తమ వర్గం మనుషులను పంపడానికి యిప్పటికే తమ చేతుల్లో వున్న శక్తిని, యీ దేశంలోని ప్రతి పెద్ద పట్టణంలో తమకు వున్న వాస్తవ మెజారిటీని, ఉపయోగించడం. ప్రస్తుత కుటుంబ వోటుహక్కుతో సెంట్ స్టీఫెన్స్*కు నలభై, యాభై మందిని సులభంగా పంపవచ్చు; అలా పూర్తి కొత్త రక్తం యెక్కించడం నిజంగా అక్కడ చాలా అవసరంగా వుంది. పార్లమెంటులో అంతమాత్రం సంఖ్యలో కార్మికులు వుంటే, ఐరిష్ భూమి బిల్లు,[14] యిప్పటిలాగా, అంతకంతకూ ఐరిష్ భూస్వాముల నష్టపరిహార బిల్లుగా మారనివ్వడం అసాధ్యమయ్యేది; సీట్ల పునర్విభజనా, లంచగొండితనాన్ని నిజంగా శిక్షార్హం చేయడమూ, యెన్నికల ఖర్చులు, యింగ్లండులో తప్ప ప్రతిచోటా వున్నట్లు, పబ్లిక్ డబ్బునుండి పెట్టడమూ, వగైరా జరగాలనే డిమాండును ప్రతిఘటించడం అసాధ్యమయ్యేది.

---

*అంటే పార్లమెంటు. — అను.

అంతేగాక, యింగ్లండులో నిజంగా ప్రజాస్వామికమైన పార్టీ అసంభవం, అది కార్మిక వర్గ పార్టీ అయితే తప్ప. యితర వర్గాల విజ్ఞాన ప్రబుద్ధులు (కొంతమంది మనల్ని నమ్మించ జూస్తున్నంత దండిగా వాళ్ళు లేనిచోట) ఆ పార్టీలో చేరి, తమ చిత్తశుద్ధిని గురించి వాగ్దానాలు చేసిన తర్వాత, పార్లమెంటులో ఆ పార్టీకి ప్రాతినిధ్యం వహించవచ్చు కూడా. ఉదాహరణకు జర్మనీలో కార్మికుల ప్రతినిధులు ప్రతి సందర్భంలోనూ వాస్తవంగా కార్మికులు కారు. కానీ యింగ్లండులో గానీ, మరొకచోట గానీ, యే ప్రజాస్వామిక పార్టీ అయినా ఫలవంతంగా విజయవంతం కాలేదు, దానికి స్పష్టమైన కార్మికవర్గ స్వభావం వుంటే తప్ప. అది వదిలే శారా, ముఠాలూ, బూటకాలూ తప్ప యేమీ వుండదు.

యిది విదేశాలలో కంటె యింగ్లండులో మరింత నిజం కూడా. ప్రపంచంలో సృష్టి అయిన మొట్టమొదటి కార్మికుల పార్టీ అయిన చార్టిస్టు పార్టీ విచ్ఛిన్నమైనప్పటినుండి, దురదృష్టవశాత్తు, రాడికల్ బూటకాలు చాలానే వున్నాయి. నిజమే, కానీ చార్టిస్టులు విచ్ఛిన్నమైనారు, యేమీ సాధించలేదు. నిజమా? "ప్రజా హక్కుల పత్రం"లోని ఆరు అంశాలలో రెండు, బాలట్‌ద్వారా వోటుచేయడమూ, ఆస్తి యోగ్యత లేకపోవడమూ అనేవి, యిప్పుడు దేశంలో చట్టమైనాయి. మూడవది, సార్వత్రిక వోటింగు, కుటుంబ వోటు హక్కు రూపంలో కనీసం రమారమిగానైనా అమలులో వుంది. నాల్గవది, సమాన నియోజక వర్గాలు, స్పష్టంగా కనుచూపుమేరలో వుంది; యీ సంస్కరణ ప్రస్తుత ప్రభుత్వంచేత వాగ్దానం చేయబడింది. కనుక, చార్టిస్టు ఉద్యమ విచ్ఛిత్తి ఫలితంగా, చార్టిస్టు కార్యక్రమంలో పూర్తిగా సగం సాధింపబడింది. మరి, కేవలం కార్మికవర్గంయొక్క ఒక గత రాజకీయ పార్టీని స్మరించడం యీ రాజకీయ సంస్కరణలనూ, యివిగాక సాంఘిక సంస్కరణల పరంపరనూ సాధించ గలిగితే, పార్లమెంటులో నలభై యాభై మంది ప్రతినిధులమద్దతుతో ఒక కార్మికుల రాజకీయ పార్టీ వాస్తవంగా వుంటే యేమి సాధించగలదు? ప్రతివొకడూ తన్ను తాను సంరక్షణ చేసుకోక తప్పని ప్రపంచంలో మనం జీవిస్తున్నాము. కానీ యింగ్లీషు కార్మికవర్గం భూస్వామ్య, పెట్టుబడిదారీ, చిల్లర వర్తక వర్గాలనూ, వాళ్ల తోక అయిన లాయర్లనూ, పత్రికా రచయితలనూ, వగైరాలను తన ప్రయోజనాలను సంరక్షణ చేయనిస్తున్నది. అందుకనే కార్మికునికి ప్రయోజనకరమైన సంస్కరణలు అంత నిదానంగానూ, అంత చిన్నచిన్న ముక్కలుగానూ రావడంలో ఆశ్చర్యం లేదు. ఇంగ్లండు కార్మికజనం చేయవలసిందల్లా సంకల్పించడమే, తమ స్థితికి అవసరమైన సాంఘిక, రాజకీయ సంస్కరణను ప్రతిదాన్నీ సాధించడానికి వాళ్ళు యజమానులు. మరి ఆ పని యెందుకు చేయకూడదు?

*The Labour Standard* (London).
నం. 12, జూలై 23, 1881

# బిస్మార్క్, జర్మన్ కార్మికుల పార్టీ

బిస్మార్క్, అతని తాబేదార్లూ జర్మనీలో సోషల్ డెమోక్రటిక్ కార్మికుల పార్టీ సభ్యులమీద సాగించిన దారుణాలను గురించి యింగ్లీషు బూర్జువా పత్రికలు యిటీవల మొండి మౌనం వహించినాయి. *Daily News* ఒక్కటే కొంతవరకు మినహాయింపుగా వుంది. గతంలో, విదేశాలలో నియంతృత్వ ప్రభుత్వాలు తమ ప్రజలపట్ల అలాంటి పిచ్చిచేష్టలు చేసినప్పుడు, యింగ్లీషు దిన, వార పత్రికల్లో నిజంగా పెద్ద గోల వుండేది. కానీ యిక్కడ పీడిత పక్షాలు కార్మికులు, ఆ పేరుకు గర్వించేవాళ్లు; "గొప్పవాళ్ల సమాజానికి," "పైపది మందికి," ప్రతినిధులైన పత్రికలు వాస్తవాలను అణగదొక్కి, తమ మొండి మౌనంద్వారా, దాదాపు వాటిని ఆమోదిస్తున్నట్లు కనపడతాయి. నిజమే, కార్మికులకు రాజకీయాలతో యేంపని? వాటిని వాళ్ల "అధికుల"కు వదిలేయండి. యిక తరువాత, యింగ్లీషు పత్రికల మౌనానికి రెండవ కారణం యేమిటంటే: బిస్మార్క్ సోషలిస్టు వ్యతిరేక చట్టాన్నీ,[15] దాన్ని అతను అమలుజరిపే పద్ధతినీ ఖండించడమూ, అదే నోటితో ఐర్లండులో ఫోర్‌స్టర్ బల వంతపు చర్యలను[16] సమర్థించడమూ చాలా కష్టం. యిదొక వచ్చి వుందు, దీన్ని తాకకూడదు. ఐర్లండులో ప్రస్తుత ప్రభుత్వపు చర్యద్వారా యూరప్‌లోనూ, అమెరికాలోనూ యింగ్లండు యొక్క నైతిక స్థానం యెంత దిగజారిందీ బూర్జువా పత్రికలు తామే గుర్తుచేస్తాయని ఆశించజాలం.

ప్రతి సాధారణ యెన్నికలలోనూ జర్మన్ కార్మికుల పార్టీ వోట్ల సంఖ్య పెరిగింది. గత యెన్నికలకంటె ముందు యెన్నికలలో 5,00,000 వోట్లూ, గత యెన్నికలలో 6,00,000 వోట్లూ వాళ్ల అభ్యర్థులకు పడినాయి. బెర్లిన్ యిద్దరినీ, ఎల్బర్‌ఫీల్డ్ బార్మెన్ ఒకరినీ, బ్రెస్లా, డ్రెస్డెన్ ఒక్కొక్కరినీ యెన్నుకున్నాయి. ప్రభుత్వమూ, మొత్తం లిబరల్, కన్సర్వేటివ్, కాథలిక్ పార్టీలూ కలిసి యేర్పడిన సమ్మేళనం యెదుట, చక్రవర్తిని కాల్చివేయడానికి జరిగిన రెండు ప్రయత్నాలు, యే ప్రయత్నాలకు కార్మికుల పార్టీని బాధ్యురాలినిగా చేయడానికి యితర పార్టీలన్నీ అంగీకారానికి వచ్చినాయో అవి, సృష్టించిన గోల యెదుట, పది సీట్లు కార్మికుల పార్టీ గెలుచుకుంది. తరువాత, సోషల్ డెమోక్రసీని బహిష్కరించే చట్టం చేయ

డంలో బిస్మార్కు విజయం పొందినాడు. కార్మికుల వార్తాపత్రికలు, యాభైకి పైగా, అణచివేయబడినాయి; వాళ్ల సంఘాలూ, క్లబ్బులూ విచ్ఛిన్నంచేయబడినాయి; వాళ్ల నిధులు స్వాధీనంచేసుకోబడినాయి; వాళ్ల సభలు పోలీసులచేత చెదరగొట్టబడినాయి; యిక అన్నిటికీ మకుటాయమానంగా, మొత్తం పట్టణాలలోనూ, జిల్లాలలోనూ, సరిగ్గా ఐర్లండులో లాగా, "అత్యవసర పరిస్థితి ప్రకటింపబడ వచ్చు" ననే చట్టం చేయబడింది. ఐర్లండులో యింగ్లీషు బలవంతపు చట్టాలు[17] కూడా చేయడానికి సాహసించని పనులు జర్మనీలో బిస్మార్కు చేసినాడు. "అత్యవసర పరిస్థితి ప్రకటింపబడిన" ప్రతి జిల్లాలోనూ, సోషలిస్టు ప్రచారం చేస్తున్నట్లు తమకు "న్యాయమైన అనుమానం"గల యెవరినైనా బహిష్కరించే అధికారం పోలీసులకు లభించింది. సహజంగా, బెర్లిన్‌లో వెంటనే అత్యవసర పరిస్థితి ప్రకటింపబడింది; వందలకొలది (వాళ్ల కుటుంబాలతో కలిసి వేలకొలది) జనం బహిష్కరింపబడినారు. ప్రష్యన్ పోలీసులు యెప్పుడూ పురుషులను కుటుంబాలతో సహా బహిష్కరిస్తారు; అవివాహిత యువకులను సాధారణంగా బహిష్కరించరు; వాళ్లకు బహిష్కరణ యేమీ పెద్ద శిక్ష కాదు, కానీ కుటుంబ యజమానులకు, అత్యధిక సందర్భాలలో, సర్వనాశనం కాకపోయినా, దీర్ఘ దారిద్ర్యం ఔతుంది. తరువాత హాంబుర్గ్ ఒక కార్మికుణ్ణి పార్లమెంటు సభ్యునిగా యెన్నుకుంది, అక్కడ అత్యవసర పరిస్థితి వెంటనే ప్రకటింపబడింది. హాంబుర్గ్‌నుండి బహిష్కరింపబడిన మొదటి బృందం మనుషులు సుమారు వందమంది; వాళ్లు కాక, వాళ్ల కుటుంబాల సభ్యులు మూడు వందలకు పైగా వుండినారు. వాళ్ల ప్రయాణ ఖర్చులకూ, యితర తక్షణ అవసరాలకూ కావలసినవి కార్మికుల పార్టీ రెండు రోజులలోపల సమకూర్చింది. యిప్పుడు లైప్జిగ్‌లో అత్యవసర పరిస్థితి ప్రకటింపబడింది, మరొక విధంగా ప్రభుత్వం పార్టీ నిర్మాణాన్ని విచ్ఛిన్నంచేయలేదనే సాకు తప్ప మరే సాకు లేకుండా కూడా. మొట్టమొదటి రోజు జరిగిన బహిష్కరణలు ముప్పై మూడు; అందులో అత్యధిక భాగం కుటుంబాలు గల వివాహితులు. పట్టీలో అగ్రస్థానంలో ముగ్గురు జర్మన్ పార్లమెంటు సభ్యులు వున్నారు. బహుశా డిలన్, వాళ్ళు తనంత హీనంగా లేరనే విషయాన్ని పరిగణించి, వాళ్లకు అభినందన లేఖ పంపుతాడు.

కానీ, అంతా యింతే కాదు. కార్మికుల పార్టీ చట్టబద్ధంగా నిషేధింపబడి, యితర జర్మన్లు అనుభవిస్తున్నారని అనుకునే రాజకీయ హక్కులన్నీ దానికి తొలగింపబడినప్పుడు, ఆ పార్టీకి చెందిన విడివిడి సభ్యులను పోలీసులు తమ యిష్టం వచ్చినట్లు చేయగలరు. నిషిద్ధ ప్రచురణల కోసం వెదకడం అనే సాకుతో ఆ సభ్యుల భార్యలూ, కూతుర్లూ అత్యంత అమర్యాదకరమైన, పాశవిక ప్రవర్తనకు గురిచేయబడతారు. ఆ సభ్యులు పోలీసులకు యిష్టం వచ్చినప్పుడల్లా అరెస్టుచేయబడి, వారం తర్వాత వారం రిమాండు చేయబడి, కొన్ని నెలలు జైలులో గడిపిన తర్వాత మాత్రమే వదలిపెట్టబడతారు. కొత్త నేరాలు, క్రిమినల్ కోడుకు

తెలియనివి, పోలీసులచేత సృష్టింపబడతాయి; ఆ కోడు సకల అవకాశాలనూ దాటి సాగదీయ బడుతుంది. యిక, పోలీసులకు తరుచుగానే తమకు సహాయమూ ప్రోత్సాహమూ యిచ్చే టంత లంచగొండులైన, లేదా మొండి నమ్మకం గల మేజిస్ట్రేట్లూ, జడ్జీలూ లభిస్తారు. వాళ్ల ప్రమోషన్ ఖరీదు అది! యివన్నీ కలిసి యేమయ్యేదీ కింది విభ్రాంతికరమైన అంకెలు తెలియజేస్తాయి. 1879 అక్టోబర్‌నుండి 1880 అక్టోబర్‌దాకా జరిగిన సంవత్సరంలో ప్రష్యాలో మాత్రమే రాజద్రోహానికీ, రాజద్రోహాత్మక నేరాలకూ, చక్రవర్తిని అవమానపరిచి నందుకూ, వగైరాలకు 1108 మందికి తక్కువ లేకుండా జైలులో పెట్టబడినారు; రాజకీయ పరువు నష్టాలూ, బిస్మార్కును అవమానపరచడమూ, ప్రభుత్వాన్ని నీచపరచడమూ, వగైరాలకు 10,094 మందికి తక్కువ లేకుండా జైలులో పెట్టబడినారు. మొత్తం పదకొండు వేలా రెండు వందలా యిద్దరు రాజకీయ ఖైదీలన్నమాట — యిది ఫోర్‌స్టర్ ఐరిష్ వీరకృత్యాలను కూడా మించిపోయింది!

కానీ, తన బలవంతం అంతటితోనూ బిస్మార్కు యేమి సాధించినాడు? సరిగ్గా ఫోర్‌స్టర్ ఐర్లండులో సాధించినంతే. సోషల్ డెమోక్రటిక్ పార్టీ, ఐరిష్ భూమి లీగు[18] లాగే, మూడు పూమ లారుకాయలుగా వుండి, దృఢమైన సంస్థా నిర్మాణం కలిగివుంది. కొద్ది రోజుల క్రితం మాన్‌హీమ్ పట్టణ కౌన్సిల్‌కు యెన్నికలు జరిగినాయి. కార్మికవర్గ పార్టీ పదహారు మంది అభ్యర్థులను నియమించి, దాదాపు ఒకటికి మూడు మెజారిటీతో అందరినీ గెలిపించు కుంది. అదిగాక, డ్రెస్డెన్‌కు జర్మన్ పార్లమెంటు సభ్యుడైన బేబెల్ లైప్జిగ్ జిల్లా తరపున శాక్సన్ పార్లమెంటుకు నిలబడినాడు. బేబెల్ స్వయంగా కార్మికుడు (టర్నర్), జర్మనీలో అత్యుత్తమ ఉపన్యాసకుడు కాదనుకున్నా, అత్యుత్తమ ఉపన్యాసకుల్లో ఒకడు. అతను యెన్ను కోబడకుండా చేయడానికి, అతని నియోజకవర్గ కమిటీ నంతటినీ ప్రభుత్వం బహిష్కరించింది. ఫలిత మేమిటి? పరిమిత వోట్లతో కూడా బేబెల్ బలమైన మెజారిటీతో గెలిచినాడు. ఆవిధంగా, బిస్మార్కు బలవంతం అతని కేమీ ఒనగూర్చడం లేదు; పైగా, ప్రజలను రెచ్చగొట్టుతున్నది. తమ హక్కులు స్థిరపరుచుకోడానికి చట్టబద్ధ పద్ధతులన్నీ తొలగింపబడినవాళ్లు ఒక శుభ ముహూర్తాన చట్టవ్యతిరేక పద్ధతులు అవలంబిస్తారు; వాళ్ల నెవరూ నిందించజాలరు. ఆ సూత్రాన్ని గ్లాడ్‌స్టనూ, ఫోర్‌స్టరూ యెన్నిసార్లు ఉద్ఘాటించినారు? మరి యిప్పుడు వాళ్లు ఐర్లండులో యెలా ఆచరిస్తున్నారు?

*The Labour Standard* (London),
నం. 12, జూలై 23, 1881

43

# దూదీ, యినుమూ

దూదీ, యినుమూ మన కాలంలో రెండు అత్యంత ముఖ్యమైన ముడి పదార్థాలు. దూది, యినుము వస్తువుల ఉత్పత్తిలో యే జాతి అగ్రజాతిగా వుంటుందో, అది సాధారణంగా పారిశ్రామిక జాతుల పట్టీలో అగ్రస్థానంలో వుంటుంది. యింగ్లండు అలా వుంది గనుక, అలా వున్నంత కాలం, అది ప్రపంచపు ప్రథమ పారిశ్రామిక జాతిగా వుంటుంది.

కనుక, యింగ్లండులో దూది, యినుము కార్మికులు అసాధారణంగా బాగుపడివుండాలని అనుకోవచ్చు; మార్కెట్లో యింగ్లండు పెత్తనం వహిస్తున్నది గనుక, యీ వస్తువుల్లో వ్యాపారం యెప్పుడూ బాగుండాలనీ, కనీసం యీ రెండు పరిశ్రమల్లోనూ సౌభాగ్యపు రామరాజ్యం, నిర్నిబంధ వర్తక ఆందోళన కాలంలో వాగ్దానంచేయబడింది, సాధింపబడాలనీ అనుకోవచ్చు. కానీ, మన కందరికీ తెలుసు — యిది వాస్తవానికి చాలా దూరంగా వుంది; యిక్కడ, యితర వృత్తుల్లో లాగే, కార్మికుల పరిస్థితి హీనం కాలేదంటే, కొన్ని సందర్భాలలో బాగుపడడం కూడా జరిగిందంటే, అది పూర్తిగా వాళ్ల సొంత కృషివల్లనే — బలమైన సంస్థా నిర్మాణంవల్లా, తీవ్ర పోరాటం జరిగిన సమ్మెలవల్లా. 1874 ప్రాంతంలోనూ, ఆ తర్వాత వుండిన కొద్ది హ్రస్వ సంవత్సరాల సౌభాగ్యం తర్వాత, దూది, యినుము వృత్తుల సంపూర్ణ అధఃపతనం జరిగిందని మనకు తెలుసు; ఫాక్టరీలు మూసివేయబడినాయి, కొలుములు ఆర్పివేయబడినాయి, ఉత్పత్తి కొనసాగింపబడిన చోట స్వల్ప కాలం పనిచేయడం నియమంగా వుండింది. అలాంటి అధఃపతన కాలాలు యింతకు ముందు కూడా వుండినాయి; అవి సగటున ప్రతి పదేండ్లకూ ఒకసారి వస్తాయి; అవి తమ గడువుదాకా వుండడమూ, వాటిని తొలగించి కొత్త సౌభాగ్య కాలం రావడమూ, యిలా జరుగుతూవుంటుంది.

కానీ, ప్రత్యేకించి దూది, యినుము పరిశ్రమలలోని ప్రస్తుత మాంద్య కాలంయొక్క విలక్షణ గుణం యేమిటంటే, యిది యిప్పుడు తన మామూలు గడువు దాటి కొన్ని సంవత్సరాలుగా నిలిచివుంది. పునరుద్ధరణకు కొన్ని ప్రయత్నాలు జరిగినాయి, ఊకించి ముందుకు పోవడం కొన్ని దఫాలు జరిగింది; కానీ, ఫలితం శూన్యం. వాస్తవ అధఃపతన దశ అధిగమింపబడిం దంటే, వర్తకం నీరస స్థితిలోనే వుంది, మార్కెట్లు మొత్తం ఉత్పత్తిని ఖర్చు పెట్టలేని స్థితిలో కొనసాగుతున్నాయి.

దీనికి కారణం యేమిటంటే, యంత్రాలను మనం ప్రస్తుతం పారిశ్రామిక సరుకులను మాత్రమే ఉత్పత్తి చేయడానికి కాక, యంత్రాలనే ఉత్పత్తి చేయడానికి ఉపయోగిస్తున్నందు వలన, యీ పద్ధతిలో ఉత్పత్తి నమ్మశక్యంగాని వేగంతో వృద్ధికాగలుగుతున్నది. ఉత్పత్తిదారులు కావాలంటే, ఒకేఒక సౌభాగ్య దశలో, యాభై శాతం సరుకును యెక్కువ ఉత్పత్తి చేయడానికి తగినట్లుగా దూదివి వడికే యంత్రాలనూ, నేసే యంత్రాలనూ, చలువ చేసే యంత్రాలనూ, ప్రింటుచేసే యంత్రాలనూ పెంచవచ్చు, మొత్తం దుక్క యినుము ఉత్పత్తినీ, సకల రకాల యినుము వస్తువుల ఉత్పత్తినీ రెండు రెట్లు చేయవచ్చు. వాస్తవంగా పెరుగుదల అంత జరగలేదు. కానీ, గత విస్తరణ దశలతో పోలిస్తే, పెరుగుదల విపరీతంగా జరిగింది. పర్యవసానం యేమిటంటే, దీర్ఘ అమితోత్పత్తి, దీర్ఘ వర్తక మాంద్యం. యజమానులు వేచి వుండగలరు, కనీసం గణనీయమైన కాలం; కానీ కార్మికులు బాధపడవలసి వుంది; అది వాళ్లకు దీర్ఘ దారిద్ర్యం, నిత్యం వర్క్ హౌస్‌కు పోయే ప్రమాదం.

యిదే మరి యశోదీప్తమైన నిర్నిబంధ పోటీ వ్యవస్థయొక్క ఫలితం, యిదే కాబ్డెన్‌లూ, బ్రైట్‌లూ, అండ్ కంపెనీ వాగ్దానంచేసిన రామరాజ్యపు వాస్తవీకరణ! యిదే కార్మికులు అనుభవించవలసింది — వాళ్లు, గత యిరవై అయిదు సంవత్సరాలూ చేసినట్లు, సామ్రాజ్యపు ఆర్థిక విధాన నిర్వహణను తమ "సహజ అధికుల"కు వదలిపెట్టితే, థామస్ కార్లైల్ అభిప్రాయం ప్రకారం దేశంయొక్క పారిశ్రామిక సైన్యంమీద పెత్తనం వహించడానికి నియమితులైన "పారిశ్రామిక సైన్యాధిపతుల"కు వదలిపెట్టితే. పారిశ్రామిక సైన్యాధిపతులే నిజంగా! వీళ్లతో పోలిస్తే 1870లో లూయీ నెపోలియన్ సేనానాయకులు మహామేధావులు. యీ బూటకపు పారిశ్రామిక సైన్యాధిపతులలో ప్రతివాడూ యితర ప్రతివానితోనూ పోరాటంచేస్తాడు, పూర్తిగా తనపాటికి తాను వ్యవహరిస్తాడు, పొరుగువాడు చేసేదానితో నిమిత్తం లేకుండా తన యంత్రాలను పెంచుతాడు, చివరకు ఫలితంగా అమితోత్పత్తి యేర్పడిందని అందరూ, మహాశ్చర్యంతో, తెలుసుకుంటారు. ఉత్పత్తిని సరిదిద్దడానికి వాళ్ళు యేకం కాలేరు. ఒకందుకు మాత్రమే వాళ్లు యేకమౌతారు: తమ కార్మికుల వేతనాలు తగ్గించి వుంచడానికి. యీవిధంగా, మార్కెట్ల వినియోగ శక్తిని యెంతో మించి దేశ ఉత్పాదక శక్తిని నిర్లక్ష్యంగా పెంచడంద్వారా వాళ్లు తమ కార్మికులనుండి సాపేక్ష సౌఖ్యాన్ని దొంగిలిస్తున్నారు — మితమైన సౌభాగ్య దశ దేన్ని యిస్తుందో, దీర్ఘ అధఃపతనం తర్వాత తమ ఆదాయాలను సగటు ప్రమాణానికి తీసుకరావడానికి యేది వాళ్ల న్యాయమైన హక్కో ఆ సాపేక్ష సౌఖ్యాన్ని దొంగిలిస్తున్నారు. ఉత్పత్తిదారులు, ఒక వర్గంగా, దేశంయొక్క గొప్ప ఆర్థిక ప్రయోజనాలకు దర్శకత్వం వహించడానికి — కాదు — ఉత్పత్తి ప్రక్రియకైనా దర్శకత్వం వహించడానికి యిక యెంతమాత్రమూ సమర్థులు కాకుండా పోయినారని యింకా అర్థం కాదా?

యింగ్లండు కార్మికుల శత్రువులలో కెల్ల శత్రువు నిత్యం పెరుగుతున్న వాళ్ల సొంత చేతుల ఉత్పాదకత కావడం, వాస్తవ మైనప్పటికీ, అసంబద్ధం కాదా?

కానీ, లెక్కలోకి తీసుకోవలసిన వాస్తవం మరొకటి వుంది. తమ ఉత్పాదక శక్తులను పెంచేది యింగ్లీషు ఉత్పత్తిదార్లు మాత్రమే కాదు. యితర దేశాల్లో కూడా అదే జరుగుతుంది. వివిధ అగ్రగామి దేశాల జవుళీ పరిశ్రమనూ, యినుము పరిశ్రమనూ విడిగా పోల్చడానికి గణాంక లెక్కలు లేవు. కానీ, మనం జవుళీ, గనుల, లోహ పరిశ్రమలను మొత్తంగా తీసుకొని, ప్రష్యన్ గణాంక బ్యూరో ప్రధానాధికారి డాక్టర్ ఎంగెల్ *Das Zeitalter des Dampfs* ('ఆవిరి యుగం,' బెర్లిన్ 1881) అన్న తన పుస్తకంలో యిచ్చిన సమాచారంతో ఒక తులనాత్మక పట్టీ తయారుచేయగలం. ఆయన లెక్కల ప్రకారం, పై పరిశ్రమలలో, కింద చెప్పబడిన దేశాలలో ఉపయోగంలో వున్న ఆవిరి యింజన్ల మొత్తం హార్సు పవరు యిది (ఒక హార్సు పవరు అంటే 75 కిలోగ్రాముల బరువును ఒక సెకండులో ఒక మీటరు యెత్తుకు యెత్తగల శక్తి):

| | జవుళీ పరిశ్రమలు | గనుల, లోహాల పరిశ్రమలు | |
|---|---|---|---|
| యింగ్లండు, 1871 . . . . . . . . . | 5,15,800 | 10,77,000 | హా.ప. |
| జర్మనీ, 1875 . . . . . . . . . | 1,28,125 | 4,56,436 | ,, |
| ఫ్రాన్సు . . . . . . . . . . . సుమారు | 1,00,000 | 1,85,000 | ,, |
| అమెరికా సంయుక్త రాష్ట్రాలు . . సుమారు | 93,000 | 3,70,000 | ,, |

యింగ్లండుకు ప్రధాన పోటీదార్లైన మూడు జాతులు ఉపయోగించే మొత్తం ఆవిరి శక్తి జవుళీ పరిశ్రమలో యింగ్లీషు ఆవిరి శక్తిలో అయిదింట మూడు భాగాలు అనీ, గనులలోనూ, లోహ పరిశ్రమలోనూ దానికి దాదాపు సమానమనీ తెలుస్తుంది. ఆ దేశాల ఉత్పత్తిదార్లు యీ దేశపు ఉత్పత్తిదార్లకంటె యెంతో యెక్కువ వేగంగా పురోగమిస్తున్నారు గనుక, త్వరలో వాళ్లు వీళ్లను దాటిపోతా రనడంలో యేమీ సందేహం వుండజాలదు.

యిక, రైళ్లలోనూ, ఓడల్లోనూ కాక, ఉత్పత్తిలో ఉపయోగించే ఆవిరి హార్సు పవరును తెలిపే యీ పట్టీ చూడండి:

| | | హార్సు పవరు |
|---|---|---|
| గ్రేట్ బ్రిటన్ . . . . . . . . . . . . . . . | సుమారు | 20,00,000 |
| అమెరికా సంయుక్త రాష్ట్రాలు . . . . . . . . . | సుమారు | 19,87,000 |
| జర్మనీ . . . . . . . . . . . . . . . . . . | సుమారు | 13,21,000 |
| ఫ్రాన్సు . . . . . . . . . . . . . . . . . . | సుమారు | 4,92,000 |

ఆవిరి ఉత్పత్తులలో యింగ్లండుకు యెంత స్వల్పంగా గుత్తాధిపత్యం మిగిలివుండేదీ, యింగ్లండుకు పారిశ్రామిక ఆధిక్యాన్ని సంపాయించడంలో నిర్నిబంధ వర్తకం యెంత స్వల్పంగా విజయం పొందిందీ యీ పట్టీ యింకా స్పష్టంగా తెలియజేస్తుంది. మరి, విదేశ పరిశ్రమల యీ పురోగతి కృతకమనీ, రక్షణ మూలంగా జరిగిందనీ అనకుందురు గాక. జర్మన్ ఉత్పత్తుల అపార విస్తరణ యావత్తూ అత్యంత ఉదారమైన నిర్నిబంధ వర్తక రాజ్యంలో సాధింపబడింది. యిక అమెరికా, అన్నిటినీ మించి అసంబద్ధమైన ఆంతరంగిక ఎక్సైజ్ వ్యవస్థ మూలంగా, నిజమైన రక్షణకంటె యెక్కువగా లా కనపడేదాన్ని నిర్బంధంగా అవలంబించవలసి వచ్చి వుంటే, బహిరంగ మార్కెట్‌లో అమెరికా పోటీచేయడానికి యీ ఎక్సైజ్ చట్టాలు రద్దు చేస్తే సరిపోతుంది.

యిరవై అయిదు సంవత్సరాలు మాంచెస్టర్ శాఖ సిద్ధాంతాలు దాదాపు ఏకచ్ఛత్రంగా రాజ్యంచేసి దేశాన్ని యీ స్థితిలో వదలిపెట్టినా యన్నమాట. వచ్చే యిరవై అయిదు సంవత్సరాలు కార్మికవర్గాలకు అవకాశం యిచ్చేటట్లు, మాంచెస్టర్, బర్మింగ్‌హామ్ పెద్దమనుషులను తొలగించివేయాలని కోరేటట్టివి యీ ఫలితాలు, అని మేము అనుకుంటున్నాము. నిశ్చయంగా కార్మికవర్గం యింతకంటె అధ్వాన్నంగా నిర్వహించలేదు.

*The Labour Standard* (London),
నం. 13, జూలై 30, 1881

# సాంఘిక వర్గాలు — అవసరమైనవీ, అనవసరమైనవీ

సమాజంలోని వర్గాలు యే మేరకు ఉపయోగకరం, లేక అవసరం కూడా? — అనే ప్రశ్న తరుచుగా అడగబడింది. సహజంగా, పరిగణించబడిన ప్రతి భిన్న చారిత్రక యుగానికీ జవాబు భిన్నంగా వుండింది. భూస్వామ్య ప్రభువర్గం సమాజంలో ఒక అనివార్యమైన, అవసరమైన అంశంగా వుండిన కాలం ఒకటి నిస్సంశయంగా వుండింది. కానీ, అది చాలా చాలా కాలం కిందట. తరువాత పెట్టుబడిదారీ మధ్యతరగతి, ఫ్రెంచివాళ్ళ బూర్జువావర్గం అనేది, అంతే అనివార్యమైన అవసరంతో ఉత్పన్నమై, భూస్వామ్య ప్రభువర్గంతో పోరాడి, దాని రాజకీయ అధికారాన్ని విచ్ఛిన్నంచేసి, తన వంతులో ఆర్థికంగా, రాజకీయంగా ప్రబలమైన కాలం ఒకటి వుండింది. కానీ, వర్గాలు ఉత్పన్నమైనప్పటినుండి, కార్మికవర్గం లేకుండా సమాజం నడిచే కాలం యెప్పుడూ లేదు. ఆ వర్గంయొక్క పేరూ, సాంఘిక ప్రతిపత్తీ మారినాయి. బానిస పోయి, అతని స్థానంలో ఫ్యూడల్ దాసుడు వచ్చినాడు; తిరిగి ఫ్యూడల్ దాసుని తొలగించి అతని స్థానంలో స్వేచ్ఛాయుత కార్మికుడు వచ్చినాడు — దాస్యంనుండి విముక్తుడైనవాడు, కానీ తన సొంత శ్రమ శక్తి తప్ప సకల ప్రాపంచిక ఆస్తులనుండీ కూడా విముక్తుడైనవాడు. కానీ యిది స్పష్టం: సమాజంలో ఉత్పత్తి చేయని పైవర్గాలలో యెలాంటి మార్పులు జరిగినా, ఉత్పత్తి చేసేవాళ్ల వర్గం ఒకటి లేకుండా సమాజం బతకలేకపోయింది. కనుక, యీ వర్గం సకల పరిస్థితులలోనూ అవసరమైనది — యిది యిక యెంతమాత్రమూ ఒక వర్గంగా వుండక, సమాజ మంతా తానే అయ్యే కాలం రాక తప్పనప్పటికీ.

ప్రస్తుతం యీ మూడు వర్గాల ఉనికికి అవసర మేమిటి?

భూస్వామ్య ప్రభువర్గం, మితంగా చెప్పాలంటే, ఆర్థికంగా యింగ్లండులో నిరుపయోగం; ఐర్లండులోనూ, స్కాట్లండులోనూ, దాని జనాభా క్షీణకర ధోరణులద్వారా, అది పచ్చి హానిగా తయారైంది. ప్రజలను సముద్రం అవతలికీ, ఆకలి మంటలలోకీ పంపడమూ, వాళ్ల స్థానంలో గొర్రెలనూ, జింకలనూ వుంచడమూ — అంతే ఐర్లండు, స్కాట్లండు భూస్వాములు చెప్పకోగల ఘనత అంతా. అమెరికన్ వ్యవసాయ, పశు ఆహార పోటీ యింక కొంచెం అభివృద్ధి కానీ, యింగ్లీషు భూస్వామ్య ప్రభువర్గం కూడా ఆ పనే చేస్తుంది, కనీసం, వెనుక ఆపుగా పెద్ద పట్టణ ఆస్తులు వుండడంవలన ఆ పని చేయగలవాళ్ళు. తక్కినవాళ్ల

నుండి అమెరికన్ ఆహార పోటీ మనల్ని త్వరలో విముక్తి చేస్తుంది. పీడ వదలుతుంది కూడా — యెందుకంటే, వాళ్ల రాజకీయ చర్య ప్రభువుల సభలోనూ, కామన్స్ సభలోనూ పరమ జాతీయ హానిగా వుంది.

కానీ, బ్రిటిష్ వలస సామ్రాజ్యాన్ని స్థాపించి, బ్రిటిష్ స్వేచ్ఛను ప్రతిష్ఠించిన ఆ విజ్ఞాన ప్రబుద్ధ, ఉదార వర్గమైన పెట్టుబడిదారీ వర్గం మాటేమిటి? 1831లో పార్లమెంటును సంస్కరించి[19], ధాన్యం చట్టాలు రద్దుచేసి, పన్ను తర్వాత పన్ను తగ్గించిన వర్గం మాటేమిటి? యింగ్లండుయొక్క బ్రహ్మాండమైన పరిశ్రమలనూ, అపారమైన వాణిజ్య నౌకాదళాన్నీ, నిత్యం విస్తరిస్తున్న రైల్వే వ్యవస్థనూ సృష్టించి, యిప్పటికీ నడిపిస్తున్న వర్గం మాటేమిటి? నిశ్చయంగా అది కనీసం దానిచేత ఆజ్ఞాపించబడి, అంతకంతకూ పురోగతికి నడిపించబడే కార్మికవర్గం యెంత అవసరమో అంత అవసరంగా వుండాలి.

ఆవిరి ఉత్పత్తుల, ఆవిరి రవాణా సాధనాల ఆధునిక వ్యవస్థను సృష్టించడమూ, ఆ వ్యవస్థ అభివృద్ధిని ఆలస్యంచేసిన, లేక అడ్డగించిన ప్రతి ఆర్థిక, రాజకీయ అవరోధాన్నీ నలిపివేయడమూ నిజంగా పెట్టుబడిదారీ మధ్యతరగతియొక్క ఆర్థిక కర్తవ్యంగా వుండింది. పెట్టుబడిదారీ వర్గం యీ కర్తవ్యాన్ని నెరవేర్చినంతవరకు, అది ఆ పరిస్థితులలో అవసరమైన వర్గంగా వుండిం దనడంలో సందేహం లేదు. కానీ యింకా అది అలా వుందా? మొత్తం సమాజ లాభంకొరకు సామాజిక ఉత్పత్తిని నిర్వహించి, విస్తరించే వర్గంగా అది తన కీలక కర్తవ్యాన్ని నెరవేర్చడం కొనసాగిస్తున్నదా? చూద్దాం.

వార్తా, రవాణా సాధనాలతో మొదలుపెడదాం. టెలిగ్రాఫులు ప్రభుత్వం చేతిలో వుండడం కనపడుతుంది. రైల్వేలూ, సముద్రయానం చేసే ఆవిరి ఓడలలో పెద్ద భాగమూ తమ వ్యాపారాన్ని తామే నిర్వహించుకునే విడివిడి పెట్టుబడిదార్లకు చెందినవి కాక, జాయింట్ స్టాక్ కంపెనీలకు చెందినవిగా వున్నాయి; ఆ కంపెనీల వ్యాపారం వాటి తరఫున జీతగాళ్ల చేత, యెవరి స్థానం యేవిధంగా చూసినా క్రియలో ఉన్నతమైన, అధిక వేతనం వచ్చే కార్మికుల స్థానంగా వుందో ఆ నౌకర్లచేత, నిర్వహించబడుతున్నది. డైరెక్టర్ల, షేర్‌హోల్డర్ల విషయం యేమిటంటే, ఆ ఉభయులకూ తెలుసు, నిర్వహణలో డైరెక్టర్లూ, తనిఖీలో షేర్‌హోల్డర్లూ యెంత తక్కువ జోక్యం కలిగించుకుంటే, కంపెనీకి అంత మంచిదని. వ్యాపారపు యజమానులకు మిగిలిన ఒకేఒక కర్తవ్యం, నిజంగా, ఉదారమైన, అత్యధిక సందర్భాలలో నామకార్థపు తనిఖీ. యీ విధంగా, యీ అపారమైన సంస్థల పెట్టుబడిదారీ యజమానులకు, వాస్తవంలో, వాటి విషయంలో చేయవలసిన పనేమీ మిగల్లేదు, అర్ధ సంవత్సరపు డివిడెండు వారంట్లు మార్చి డబ్బు తెచ్చుకోవడం తప్ప. యిక్కడ పెట్టుబడిదారుని సామాజిక కర్తవ్యం జీతాలు యిచ్చే ఉద్యోగులకు బదలాయించబడింది. కానీ పెట్టుబడిదారుడు, తన

డివిడెండ్లద్వారా, ఆ కర్తవ్యాలకు జీతం జేబులో వేసుకుంటూనే వున్నాడు, నాటిని నిర్వహించడం మానుకున్నప్పటికీ.

యీ పెద్ద సంస్థల విస్తృతి వాటి నిర్వహణనుండి యెవరిని "రిటైర్" అయ్యేటట్లు నిర్బంధించిందో, ఆ పెట్టుబడిదారునికి యిప్పటికీ మరొక కర్తవ్యం మిగిలివుంది. ఆ కర్తవ్యం యేమిటంటే, స్టాక్ ఎక్స్ఛేంజిలో తన షేర్లతో చట్టావ్యాపారం చేయడం. "రిటైరైన," లేదా వాస్తవంలో తొలగింపబడిన మన పెట్టుబడిదార్లు, అంతకు మించిన పనేమీ లేక, యీ ధనలక్ష్మి దేవళంలో తృప్తిదీర జూదమాడుతారు. తాము సంపాయిస్తున్నట్లు నటించే డబ్బును జేబులో వేసుకోవాలనే స్థిరమైన ఉద్దేశంతో వాళ్లు అక్కడికి పోతారు. అయినా వాళ్లు అంటారు, సమస్త ఆస్తికీ శ్రమా, పొదుపూ మూలం అని — బహుశా మూలం కావచ్చు కానీ గమ్యం కానేకాదు. మన పెట్టుబడిదారీ సమాజానికి, సరిగ్గా తన కేంద్రంగా, లక్షలు లక్షలు గెలుచుకునే, ఓడిపోయే బ్రహ్మాండమైన జూదగృహం లేకుండా పనిజరగనప్పుడు, చిల్లర జూదగృహాలను మూసివేయడం యెంత వంచన! యిక్కడ నిజంగా, "రిటైరయిన," షేర్లు గల పెట్టుబడిదారుని ఉనికి అనవసరమే కాక, పరమ హానిగా కూడా తయారౌతున్నది.

రైల్వేల విషయంలోనూ, ఆవిరి ఓడల విషయంలోనూ నిజమైనది పెద్ద పారిశ్రామిక, వర్తక సంస్థ లన్నిటి విషయంలోనూ రోజురోజుకూ మరింత నిజమౌతున్నది. "ఫ్లోట్ చేయడం" — పెద్ద ప్రైవేటు సంస్థలను లిమిటెడ్ కంపెనీలుగా మార్చడం — గత పదేండ్లుగా, యింకా యెక్కువగా, మామూలు దినచర్య అయింది. లండన్‌లోని మాంచెస్టర్ గిడ్డంగులు మొదలుకొని వేల్స్‌లోనూ, ఉత్తరానా వున్న యినుము కర్మాగారాలూ, బొగ్గు గనులదాకా, లాంకషైర్ ఫాక్టరీలదాకా ప్రతిదీ ఫ్లోట్ చేయబడింది, లేదా చేయబడుతున్నది. మొత్తం ఓల్డమ్‌లో ప్రైవేటు చేతుల్లో మిగిలిన జవుళీ మిల్లు దాదాపు ఒకటి కూడా లేదు; అంతే కాదు, చిల్లర వర్తకులు కూడా "సహకార దుకాణాల" చేత తొలగింపబడుతున్నారు, అందులో పెద్ద మెజారిటీ పేరుకు మాత్రమే సహకార సంస్థలు — ఆ పేరు మరొక కాలం నాటిది. యీ విధంగా మనకు కనపడే దేమిటంటే, సరిగ్గా పెట్టుబడిదారుని ఉత్పత్తి వ్యవస్థయొక్క అభివృద్ధిచేతనే, చేనేతపనివాడు యెంతగా తొలగింపబడినాడో అంతగానే పెట్టుబడిదారుడు తొలగింపబడినాడు. అయినా, యీ భేదం వుంది: చేనేతపనివాడు పస్తులతో నిదానంగా చస్తాడు, తొలగింపబడిన పెట్టుబడిదారుడు మితిమీరి తినడంతో నిదానంగా చస్తాడు. యిందులో సాధారణంగా ఉభయులూ సమానమే — వాళ్లను యేమి చేసుకోవలసిందీ వాళ్లకే తెలియదు.

కనుక ఫలితం యిది: మన వాస్తవ సమాజంయొక్క ఆర్థికాభివృద్ధి ఒంటరి పెట్టుబడిదారులు యిక యెంత మాత్రమూ నిర్వహించజాలని అపారమైన సంస్థలలో ఉత్పత్తిని

సాంద్రీకరించడానికీ, సాంఘికీకరించడానికీ అంతకంతకూ అభిముఖంగా వుంది. "యజమాని కన్ను" గురించీ, అది చేసే మహత్కార్యాల గురించీ చెప్పే సొళ్లు కబుర్లు అన్నీ, ఒక సంస్థ ఒక నియమిత ప్రమాణానికి చేరుకున్న వెంటనే, పరమ చెత్తగా మారుతాయి. లండన్, నైరుతి రైల్వేయొక్క "యజమాని కన్ను"ను ఊహించండి! యజమాని చేయలేనిది కార్మికుడు, కంపెనీతో జీతాలు తీసుకునే ఉద్యోగులు, చేయగలరు — విజయవంతంగా కూడా చేయగలరు.

యీ విధంగా, పెట్టుబడిదారుడు యిక యెంతమాత్రమూ తన లాభాలను "తనిఖీ చేసినందుకు వేతనాలు"గా చెప్పకోలేడు — అతను దేనినీ తనిఖీ చేయడం లేదు గనుక. పెట్టుబడి సమర్థకులు ఆ వట్టి మాటను మనముందర వాగేటప్పుడు మన కిది జ్ఞాపకముండాలి.

మరి, మా గత వారం సంచికలో* మేము నిరూపించడానికి ప్రయత్నించింది యిది: యీ దేశపు అపార ఉత్పాదక వ్యవస్థను నిర్వహించడానికి కూడా పెట్టుబడిదారీ వర్గం అసమర్థమైపోయింది; వాళ్లు ఒకవైపున మార్కెట్లన్నిటినీ అప్పుడప్పుడు ఉత్పత్తులతో ముంచివేసేటంతగా ఉత్పత్తిని విస్తరించినారు, మరొకవైపున, విదేశ పోటీదార్లకు నిలదట్టుకోడానికి అంతకంతకూ అసమర్థులైపోయినారు. యీ విధంగా, దేశంయొక్క పెద్ద పరిశ్రమలలో పెట్టుబడిదారీ వర్గపు జోక్యం లేకుండా మనం యెంతో బాగా నిర్వహించగలగడమే కాక, వాళ్ల జోక్యం అంతకంతకూ హానిగా తయారౌతున్నదని మనకు తెలుస్తున్నది.

వాళ్లతో మళ్లీ చెప్తున్నాము: "వెనక నిలవండి! కార్మికవర్గానికి అవకాశం యివ్వండి."

*The Labour Standard* (London),
నం. 14, ఆగస్టు 6, 1881

---

* ఈ పుస్తకంలో 44 – 47 పుటలు చూడండి. — సం.

## వివరణలు

[1] *The Labour Standard* కు ఎంగెల్సు రాసిన వ్యాసపరంపరలో యిది మొదటిది. ఆ పత్రికకు ఆయన 1881 మేనుండి ఆగస్టుదాకా రచనలు పంపినాడు. వ్యాసాలు సంతకం లేనివి, సంపాదకీయాలుగా దాదాపు ప్రతివారమూ వెలువడినాయి. దాని సాధారణ అవకాశవాద ధోరణిమూలంగా, ఎంగెల్సు ఆ వారపత్రికకు పనిచేయడం మానుకోవలసి వచ్చింది.

*The Labour Standard* — జె. షిప్టన్ సంపాదకత్వం కింద, 1881నుండి 1885దాకా లండన్‌లో ప్రచురింపబడిన ఒక బ్రిటిష్ ట్రేడ్ యూనియన్ వారపత్రిక.

పుట 7.

[2] అన్ని రకాల కార్మికవర్గ సంఘాల పుట్టుకనూ, కార్యకలాపాలనూ నిషేధించిన "సంఘాలను గురించిన చట్టాల" రద్దుకు ప్రస్తావన. ఒక యేడాది తర్వాత కార్మికవర్గ సంఘాలను గురించి చేసిన చట్టం మళ్లీ ట్రేడ్ యూనియన్ల కార్యకలాపాలను పెద్దగా పరిమితపరిచింది.

పుట 7.

[3] చార్టిస్టు ఉద్యమం: ఇంగ్లండ్‌లో 19వ శతాబ్ది నాల్గవ, ఐదవ దశకాలలో తలెత్తినట్టి, ప్రపంచ చరిత్రలోని మొట్టమొదటి కార్మికవర్గ విప్లవోద్యమం. ఈ ఉద్యమంలో పాల్గొన్నవాళ్లు ప్రజా హక్కుల పత్రాన్ని (charter; ఈ పదంలోనుంచి వచ్చిన మాట "చార్టిజం") ప్రకటించారు. సార్వజనిక వోటు హక్కు, పార్లమెంటు అభ్యర్థులకు భూమి రూపంలో ఆస్తి వుండాలనే అర్హత తొలగింపు, ఇంకా తదితర డిమాండ్లూ ప్రతిపాదించబడినాయి. హక్కుల పత్రం ప్రకటించబడిన తరవాతి సంవత్సరాలలో బహిరంగ సభలూ ప్రదర్శనలూ దేశం అంతటా నిరంతరాయంగా జరిగాయి. లక్షలాది కార్మికులూ, చేతిపనులవాళ్లూ వీటిలో పాల్గొన్నారు. మహజరును పార్లమెంటుకు సమర్పించాలని 1848 ఏప్రిల్‌లో జరిగిన మూడవ చార్టిస్ట్ జాతీయ సదస్సులో నిర్ణయించబడింది. మహజరుపైన 50 లక్షలకుపైగా సంతకాలు చేశారు.

భూస్వామ్య ప్రభువర్గ ప్రతినిధులకూ, బడా బూర్జువావర్గ ప్రతినిధులకూ అత్యధిక మెజారిటీ వున్న ఇంగ్లీషు పార్లమెంటు ప్రజా హక్కుల పత్రాన్ని ధ్రువపరచేందుకు నిరాకరించి, చార్టిస్టులు సమర్పించిన అన్ని మహజర్లనూ అందుకొన తిరస్కరించింది. చార్టిస్టులపై ప్రభుత్వం తీవ్రమైన నిర్బంధకాండను సాగించి, వారి నాయకులను అరెస్టు చేసింది. ఉద్యమం అణచివేయబడింది, కాని తదుపరి తలెత్తిన అంతర్జాతీయ కార్మికోద్యమంయొక్క అభివృద్ధిపై చార్టిజం శక్తివంతమైన ప్రభావం నెరపింది. పుట 7.

4 వర్క్ హౌస్: బీదలకోసం ప్రత్యేక శరణాలయం. యింగ్లండులో 1839లో ప్రవేశపెట్టబడిన బీదల చట్టం ప్రకారం అమలుజరుపబడినాయి. ప్రభుత్వ సహాయం కోరిన వాళ్లను వర్క్ హౌస్‌లో పెట్టినారు. ఆ వర్క్ హౌస్‌లు జైలులాగా ఉండినాయి. బీదలు అక్కడ కఠినమైన శ్రమ చేయవలసివుండింది. పుట 9.

5 చాన్సరీ కోర్టు: ఉన్నత బ్రిటిష్ కోర్టులలో ఒకటి. 1873 నాటి సంస్కరణ తర్వాత యిది హైకోర్టులో ఒక భాగంగా వుంది. పుట 10.

6 ఐరిష్ భూస్వాములు తమ కౌలుదార్లపట్ల జరిపే అరాజకత్వాన్ని పరిమితపరచడానికి గ్లాడ్‌స్టన్ ప్రభుత్వం, అప్పుడు ఐర్లండులో అభివృద్ధి ఔతున్న విప్లవ పోరాటంనుండి ఐరిష్ రైతాంగం దృష్టిని పక్కకు మళ్లించే ఉద్దేశంతో చేసిన ప్రయత్నాలకు ఆ భూస్వాములు ఆగ్రహించినారు. కౌలుదార్లు తమ కౌలును సకాలంలో చెల్లించనప్పుడు వాళ్లను భూమినుండి తొలగించే భూస్వాముల హక్కును 1881 నాటి భూమి బిల్లు పరిమితపరిచింది. 15 సంవత్సరాలకు కౌలు మొత్తం ముందుగా నిర్ణయింపబడింది. భూస్వాములు తమ భూమిని లాభంతో ప్రభుత్వానికి అమ్మగలిగినా, కౌలు పెద్ద మొత్తంగా నిర్ణయింపబడినా, యింగ్లీషు భూస్వాములు, ఐర్లండులో తమ అపరిమిత పెత్తనాన్ని నిలుపుకొనే ప్రయత్నంలో, బిల్లును వ్యతిరేకించినారు. పుట 15.

7 ప్రజా హక్కుల పత్రం (The People's Charter): దీనినుండే చార్టిస్టు ఉద్యమానికి ఆ పేరు వచ్చింది. ఆ పత్రంలో చార్టిస్టుల డిమాండ్లు రూపొందించబడినాయి. యిది పార్లమెంటు బిల్లు రూపంలో 1838 మే 8న ప్రచురింపబడింది. దీనిలో ఆరు అంశాలు వుండినాయి — సార్వజనీన వోటు హక్కు (21 యేండ్లకు పైగా వున్న పురు

షులకు), పార్లమెంటుకు యేటా యెన్నికలు, రహస్య వోటింగు, సమాన నియోజక వర్గాలు, పార్లమెంటు అభ్యర్థులకు ఆస్తి యోగ్యతల రద్దు, పార్లమెంటు సభ్యులకు జీతాలు. ప్రజా హక్కుల పత్రాన్ని అంగీకరించడానికి చార్టిస్టులు పెట్టుకున్న మహజర్లను 1839లోనూ, 1842లోనూ, 1849లోనూ పార్లమెంటు నిరాకరించింది. పుట 18.

[8] విగ్గులు, టోరీలు: గ్రేట్ బ్రిటన్ రాజకీయ పార్టీలు. యివి 17వ శతాబ్ది 70–80లలో స్థాపించబడినాయి. విగ్గు పార్టీ ఫైనాన్సు వర్గాల, వ్యాపార బూర్జువావర్గాల, బూర్జువాలుగా మారిన ప్రభువుల ప్రయోజనాలకు ప్రాతినిధ్యం వహించింది. విగ్గు పార్టీ లిబరల్ పార్టీకి మూలమైంది. టోరీ పార్టీ బడా భూస్వాములకూ, మతగురువులలో అగ్రవర్ణానికీ ప్రాతినిధ్యం వహించింది. అది ఫ్యూడల్ సంప్రదాయాలను బలపరిచి, ఉదారవాద, ప్రగతిశీల డిమాండ్లను వ్యతిరేకించింది. తరువాతి కాలంలో అది కన్సర్వేటివ్ పార్టీకి మూలమైంది. విగ్గు, టోరీ పార్టీలు ఒకటి మార్చి ఒకటి అధికారం వహించినాయి. పుట 18.

[9] డిజ్రేలీ చేసిన కుటుంబ వోటు చట్టం ప్రజల ఒత్తిడిచేత 1867లో కన్సర్వేటివ్ పార్టీవాళ్లు చేసిన యెన్నికల సంస్కరణ. పుట 18.

[10] మాంచెస్టర్ శాఖ, లేక నిర్నిబంధ వర్తక శాఖ అర్థశాస్త్రంలో పారిశ్రామిక బూర్జువావర్గ ప్రయోజనాలను ప్రతిబింబించే ధోరణి. దీన్ని బలపరిచేవాళ్లు నిర్నిబంధ వర్తకాన్నీ, ఆర్థికజీవితంలో ప్రభుత్వం జోక్యంచేసుకోకుండా వుండడాన్నీ ప్రచారంచేసినారు. మాంచెస్టర్‌ను తమ కేంద్రంగా చేసుకొన్న స్వేచ్ఛా వర్తకవాదులలో కాబ్డెన్, బ్రైట్ అనే యిద్దరు జవుళీ ఉత్పత్తిదారులు ప్రముఖులుగా వుండినారు. 1840 లలోనూ, 50 లలోనూ నిర్నిబంధ వర్తకవాదులు ఒక ప్రత్యేక రాజకీయ బృందంగా యేర్పడి, తరువాత లిబరల్ పార్టీతో కలిసినారు. పుట 21.

[11] బ్రిటిష్ ఈస్టిండియా కంపెనీ రద్దైన తర్వాత, 1858లో, భారతదేశం నేరుగా బ్రిటిష్ రాజు పరిపాలన కిందికి వచ్చింది. పుట 22.

[12] పెద్ద భూస్వాముల ప్రయోజనాలకు అనుగుణంగా ధాన్యం దిగుమతిమీద వుండిన విషేధాన్ని తొలగించడం ధాన్యం చట్టాల ఉద్దేశం. పారిశ్రామిక బూర్జువావర్గానికీ, పెద్ద

భూస్వాములకూ మధ్య జరిగిన పోరాటం 1846లో ధాన్యం చట్టాలను రద్దుచేసే బిల్లును పార్లమెంటు ఆమోదించడంతో ముగిసింది. యీ చర్య ఫలితంగా కలిగిన వేతనాల తగ్గుదల కాల్రకమాన వేతనాల తగ్గింపుకు దారితీసి, బూర్జువావర్గానికి లాభాలు పెంచింది. పుట 22.

[13] ధాన్యం చట్టాల వ్యతిరేక లీగు మాంచెస్టర్ ఉత్పత్తిదార్లైన కాబ్డెన్, బ్రైట్‌లచేత 1838లో స్థాపించబడింది. వేతనాల తగ్గుదలను సాధించడానికీ, అదే సమయంలో భూస్వామ్య ప్రభువర్గంయొక్క ఆర్థిక, రాజకీయ స్థానాన్ని బలహీనపరచడానికీ లీగు సంపూర్ణ వ్యాపారస్వేచ్ఛనూ, ధాన్యం చట్టాల రద్దునూ డిమాండుచేసింది. కార్మికుల, యజమానుల ఐకమత్యం అంటూ లీగు చేసిన చౌకబారు ప్రచారంలో నిర్నిబంధ వర్తక నినాదం విస్తృతంగా ఉపయోగించబడింది. 1846లో ధాన్యం చట్టాల రద్దు తర్వాత లీగు అంతరించింది. పుట 23.

[14] వివరణ 6 చూడండి. పుట 39.

[15] సోషలిస్టు వ్యతిరేక చట్టం 1878 జర్మనీలో బిస్మార్కు ప్రభుత్వంచేత ప్రవేశపెట్టబడినది. కార్మిక సోషలిస్టు ఉద్యమాన్ని వ్యతిరేకించడం యీ చట్టానికి లక్ష్యం. దాని ప్రకారం సోషల్ డెమోక్రట్ల పార్టీ సంఘాలన్నీ, కార్మిక సంఘాలన్నీ, కార్మికుల పత్రికలన్నీ నిషేధించబడినాయి, సోషలిస్టు సాహిత్యం స్వాధీనం చేసుకోబడినది; సోషల్ డెమోక్రట్లు అన్ని విధాల హింసలకు గురిఅయారు; దేశంనుండి బహిష్కరించబడినారు. 1890లో కార్మికోద్యమం ఒత్తిడివల్లనే సోషలిస్టు వ్యతిరేక చట్టం రద్దుచేయబడినది. పుట 41.

[16] 1881 ఆగస్టులో శాసనమైన భూమి బిల్లును ప్రవేశపెట్టడాన్ని ఐరిష్ కౌలుదార్లు భీషణంగా వ్యతిరేకించినారు. ఐర్లండు శాఖ మంత్రి అయిన ఫార్‌స్టర్, కౌలు చెల్లించడానికి నిరాకరించిన కౌలుదార్లను భూములనుండి తొలగిస్తూ, ప్రత్యేక చర్యలు అవలంబించినాడు. పుట 41.

[17] ఐర్లండులోని విప్లవ, జాతీయ విమోచన ఉద్యమాలను అణచడానికి 19వ శతాబ్దిలో బ్రిటిష్ పార్లమెంటు కొన్ని సార్లు బలవంతపు చట్టాలను అమలుజరిపింది. యీ

చట్టాలు యింగ్లీషు అధికార్లకు ప్రత్యేక అధికారా లిచ్చి, ఐర్లండులో యెక్కడైనా సైనిక శాసనం ప్రకటించడానికి వీలు కలిగించింది. పుట 42.

[18] ఐరిష్ భూమి లీగు 1879లో ఒక పెటీబూర్జువా ప్రజాతంత్రవాది అయిన మైకేల్ డేవిట్‌చేత స్థాపించబడిన ప్రజా సంస్థ. ఐరిష్ రైతాంగంలోనూ, పట్టణ బీదవాళ్ల లోనూ విస్తారమైన భాగాలు భూమి లీగులో వుండినారు. ఐరిష్ బూర్జువావర్గంలోని ప్రగతిశీలురు దాన్ని బలపరిచినారు. భూస్వాముల పీడనకూ, జాతీయ పీడనకూ వ్యతిరేకంగా ఐరిష్ ప్రజలు చేసిన నిరసనలను ఐరిష్ భూమి లీగు ప్రతిబింబించింది. కానీ లీగు నాయకులు ఊగిసలాడే వైఖరి అవలంబించినారు. దీన్ని ఆసరాగా తీసుకొని బూర్జువా జాతీయవాదులు (పార్నెల్, తదితరులు) లీగు కార్యకలాపాలను హోమ్‌రూల్ కొరకు, అనగా బ్రిటిష్ సామ్రాజ్యంలోపల పరిమిత ఐరిష్ స్వపరిపాలన కొరకు, జరిపే పోరాటంగా కుదించడానికి ప్రయత్నించినారు. లీగు 1881లో నిషేధింపబడింది, కానీ వాస్తవంలో 80ల అంతందాకా పనిచేస్తూ వుండింది. పుట 43.

[19] 1831లో బ్రిటిష్ కామన్స్ సభచేత చేయబడి, 1832 జూన్‌లో ప్రభువుల సభచేత ధ్రువీకరింపబడిన యెన్నికల సంస్కరణకు యిది ప్రస్తావన. యీ సంస్కరణ భూస్వామ్య, ఫినాన్షల్ ప్రభువర్గ రాజకీయ గుత్తాధిపత్యానికి వ్యతిరేకంగా చేయబడింది. యిది పారిశ్రామిక బూర్జువావర్గానికి పార్లమెంటులో ప్రవేశం యిచ్చింది. సంస్కరణకొరకు జరిగిన పోరాటంలో ప్రధాన బలాలుగా వుండిన కార్మికవర్గమూ, పెటీబూర్జువావర్గమూ మోసగింపబడినాయి; వాళ్లకు వోటు హక్కు లభించలేదు. పుట 49.

పాపులర్ ప్రజా ప్రచురణ
గ్రూపు సంస్థలచే ప్రచురింపబడినది

# పేర్ల సూచి

నెపోలియన్ III (లూయీ బోనపార్ట్) (1808 – 1873) – ఫ్రెంచి చక్రవర్తి (1852 – 1870). – 45.

నోబుల్, జాన్ (1827 – 1892) – బ్రిటిష్ పత్రికా రచయిత, ధాన్యం చట్టాల వ్యతిరేక లీగును బలపరిచినవాడు. – 33–36.

ఫోర్‌స్టర్, విలియం ఎడ్వర్డ్ (1818 – 1886) – బ్రిటిష్ లిబరల్, ఐర్లండు శాఖ మంత్రి (1880 – 1882). – 41, 43.

బాల్‌ఫోర్, ఆర్థర్ జేమ్స్ (1848 – 1930) – బ్రిటిష్ రాజనీతిజ్ఞుడు, కన్సర్వేటివ్ పార్టీ నాయకుడు. – 21.

బిస్మార్క్, ఒట్టో (1815–1898) – 1862 నుండి ప్రష్యన్ ప్రభుత్వ నాయకుడు; 1871 – 1890 మధ్య జర్మన్ సామ్రాజ్యానికి మొదటి చాన్సలర్; ప్రష్యన్ భూస్వాముల ప్రతినిధి. ప్రష్యా నాయకత్వాన జర్మన్ సామ్రాజ్యాన్ని ఏకంచేశాడు; కార్మికోద్యమాన్ని తీవ్రంగా వ్యతిరేకించినాడు. – 24, 38, 41–43, 56.

బేబెల్, ఔగుస్ట్ (1840 – 1918) – జర్మన్ సోషల్ డెమోక్రటిక్ పార్టీ స్థాపకుల్లోనూ, ప్రముఖ వ్యక్తుల్లోనూ ఒకడు. – 43.

బ్రైట్, జాన్ (1811 – 1889) – బ్రిటిష్ లిబరల్; నిర్నిబంధ వర్తకవాది; కాబ్డెన్‌తో కలిసి ధాన్యం చట్టాల వ్యతిరేక లీగుకు నాయకత్వం వహించినవాడు. – 36, 45, 56

మంక్, చార్లెస్ జె. (జననం 1824) – బ్రిటిష్ పార్లమెంటు సభ్యుడు, లిబరల్ యూనియనిస్టు. – 21.

మెక్ ఐవర్ – బర్కెన్‌హెడ్ నియోజకవర్గానికి బ్రిటిష్ పార్లమెంటు సభ్యుడు (1881).–21.

రికార్డో, డేవిడ్ (1772 – 1823) – బ్రిటిష్ అర్థశాస్త్రజ్ఞుడు, సాంప్రదాయిక బూర్జువా అర్థశాస్త్రానికి అత్యంత ప్రముఖ ప్రతినిధి. – 13.

స్లాగ్ – మాంచెస్టర్ నియోజకవర్గానికి బ్రిటిష్ పార్లమెంటు సభ్యుడు (1881). – 21.

పాఠకులకు మనవి

ఈ పుస్తకం అనువాదం గురించిగానీ, దీని పేర్పూ కూర్పూ గురించిగానీ మీ అభిప్రాయాలనూ మీ సలహాలనూ భావిప్రచురణల సహాయార్థం మాకు పంప ప్రార్థన.

మా చిరునామా:

Progress Publishers
17, Zubovsky Boulevard,
Moscow, USSR.

61

మా ప్రచురణలు దొరికే చోట్లు:

విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
చంద్రం బిల్డింగ్స్
విజయవాడ – 520004

విశాలాంధ్ర బుక్ హౌస్
ఏలూరు రోడ్డు
విజయవాడ – 520002

విశాలాంధ్ర బుక్ హౌస్
సుల్తాన్ బజారు
హైదరాబాదు – 500001

విశాలాంధ్ర బుక్ హౌస్
రైల్వే ఫీడర్స్ రోడ్డు
అనంతపురం – 515001

విశాలాంధ్ర బుక్ హౌస్
కాలేజి రోడ్డు
అనంతపురం – 515004

విశాలాంధ్ర బుక్ హౌస్
1–11–37 గాంధీ రోడ్డు
తిరుపతి – 517501

విశాలాంధ్ర బుక్ హౌస్
సూపర్ బజారు ఎదుట
మెయిన్ రోడ్డు
విశాఖపట్నం – 530002

విశాలాంధ్ర బుక్ హౌస్
మెయిన్ రోడ్డు
హనుమకొండ
వరంగల్ – 506011

విశాలాంధ్ర బుక్ హౌస్
మెయిన్ రోడ్డు, అరండల్ పేట
గుంటూరు – 522002



మనము ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | KRSA102B120 |
| పుస్తకం పేరు | [illegible] |
| తారీఖు | 21 February 2025 |
| ముందు అట్ట | [illegible] |
| వెనుక అట్ట | [illegible] |
| మొత్తం పేజీలు | 69 |
| పెద్ద సైజు పేజీలు | no |
| ఖాళీ పేజీలు | [illegible],2,64 |
| లేని పేజీలు | no |
| తయారు చేసినది | Susmitha |
| పేజీలు విడదీసినది | Bhanusree |
| స్కాన్ చేసినది | Mary |
| పరీక్ష చేసినది | HASEEMA |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good. |